# విస్డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాస పత్రిక


సంపాదక వర్గం

సంపాదకుడు:
లయన్ కె.వి. గోవిందరావు బి.ఎస్సి., ఎల్.ఎల్.బి.

గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్. రావు బి.ఎస్సి.
వి. బాలకుమార్ ఎమ్.ఫిల్.

సభ్యులు:
కె.వి.ఎస్. గోవిందరావు బి.ఎస్సి., ఎల్.ఎల్.బి.
కె.వి.ఎస్. శరత్ బాబు బి.ఎ., బి.ఎల్.
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి


చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (సంవత్సరం) | 45.00 |


చందా పంపవలసిన చిరునామా:

విస్డమ్

8. బేకా రోడ్డు, మైలాపూరు,

మద్రాసు-600004


# ఈ సంచికలో

అక్టోబరు 1985






ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ :
ఎన్. శివన్నారాయణ, మద్రాసు-17.


లుగు విస్డమ్‌కు ఇది నాలవ సంవత్సరం

## ధ్యానం

### ఇతరులపట్ల ప్రవర్తన



జేమ్స్ ఎలెన్

"ఇతరుల పట్ల నే నెలా ప్రవర్తిస్తున్నాను?" "ఇతరులకు నేను ఏం చేస్తున్నాను?" "ఇతరులను గురించి నేను ఏమి అనుకుంటున్నాను?" "నా ఆలోచనలన్నీ అతి సంకుచితమైన స్వార్థాపేక్ష లేకుండా నిష్కల్మషమైన ప్రేమానురాగాలతో ఉన్నాయా? లేక శత్రుత్వంతో, విరోధభావంతో పగ తీర్చుకోడానికి బలాన్ని సాధించుకోడానికి స్వప్రయోజనంతో, దురభిమానంతో ఉన్నాయా?" అని ఒక్కసారి ప్రశాంతమైన మానసిక కుహరంలో ప్రశ్నించుకుని వీటిని చేసే చేత

(మిగతా 7 వ పేజీలో)

## సంపాదకుని పేజీ

### సిగ్గుపడి పోకూడదు

కొందరికి ఎక్కడిలేని సిగ్గుతో ముఖం ముడుచుకు పోతుంది. ఈ కోవకు చెందిన వాళ్లు క్రొత్త వాళ్ళ దగ్గర అనవసరంగా సంకోచపడిపోతారు. ముఖం వంచేసుకుంటారు. నిర్భయంగా మాట్లాడలేరు. ఇటువంటివారు పదిమంది చేరిన సభల్లో, సమావేశాల్లో, సదస్సులలో ఒక విధమైన భయంతో గట్టుమీద చేపలా కనిపిస్తారు. ముచ్చెమటలు కక్కుకుంటారు. శరీరం వణుకుతుంది కంపిస్తుంది, మాట తడబడుతుంది. ఏదో సంకోచపడిపోతారు. ఇవన్నీకూడా సిగ్గు బిడియం వల్ల ఏర్పడతాయి.

మనస్సులో ఒకరకమైన న్యూనతా భావ జనిస్తుంది. ఎదుటివారి కంటె తక్కు తనాన్ని మనస్సులో పెంచుకోడం వల్ల సి ఆవరించుకు పోతుంది లోకంలో ప్ర వ్యక్తికి కొద్దో, గొప్పో ఈ న్యూనతా భా ఉండనే ఉంటుంది. ఇది కేవలం భ్రాంతి కలుగుతుంది. నిజానికి ఒకరు అధికు ఇంకొకరు నీచులు అనే మాటకు అర్థం లే ఎవరి లోపాలు వారికి ఉండడం సహ ప్రపంచంలో ఏ కొద్దిమందికో తప్ప విశ్వాసం అందరిలోనూ లోపిస్తుంది. విశ్వాసం ఒక పిసరు తగ్గితే నైరా

"కోపము, అమిత సంతోషము, గర్వము, అతృప్తి, దురభిమానము, లోభము - ఈ ఆరుగుణములు దుర్మార్గ గుణములు."

నిస్పృహ మొగ్గ చూపుతాయి. దాంతో క్రొత్తవాళ్ళ ముందర ఎక్కడలేని సిగ్గు పట్టుకుంటుంది. ఇలాటి వాళ్ళు నలుగురితో చేరరు



కదా సాంఘిక సమావేశాలలో పాల్గొనటానికి అడుగు వెనకేస్తారు. మరికొందరు అతి ధైర్యంగా అసలు తొణకరు. పిరికితనాన్ని కనిపించనీయరు.

పెద్ద పెద్ద రాజకీయ యోధులు కూడా సిగ్గుకు లొంగిపోయినవారే. వీరందరిదీ ఒకటే న్యూనతా భావన. కొంతమంది ఎక్కడలేని గొప్పతనాన్ని ప్రకటించుకుంటారు; అభినయిస్తారు. నిజానికి వీరిలో ఆత్మవిశ్వాసం శూన్యం. మనోనిబ్బరం ఉండదు. సత్ప్రవర్తనకు తగిన శిక్షణ ఉండదు. వాస్తవానికి ఈ అభినయమంతా తక్కువ తనపు భావనను మూసిపెట్టుకోడానికే. కాని అధికారం చలాయించడం, అనవసరమైన వాచాలత్వం, డాంభికత్వం, ఔన్నత్యభావం, గొప్పవాళ్ళం అని అనుకోడం అతి నీచమైన సాంఘికమైన లోపాలు. సహజ సౌందర్యానికి ఇవి శత్రువులు. సిగ్గు, లజ్జ, బిడియం, సంకోచం అందరికీ ఉండేవే. వ్యక్తిగతంగా వివిధ రూపాలుగా విజృంభిస్తూ ఉంటాయి. సిగ్గుపడడం సర్వసాధారణం. ఎవరికి వారే సంస్కరించుకోడానికి ప్రయత్నించాలి. ఇంకొకరు ఎవరో మనని సంస్కరిస్తారు అనుకోడం అసంభవం. దీక్షతో కృషిచేస్తే ఆత్మవిశ్వాసం సౌలభ్యంగా సాధించవచ్చు.

మనో నిబ్బరం, ఆత్మ విశ్వాసం, నిండు మనస్సు అనుభవం మీద అలవడతాయి. ప్రత్యేకత ప్రకటించుకోవాలి. వ్యక్తిత్వాన్ని ప్రదర్శించుకోడానికి ప్రత్యేకత అవసరం. ప్రత్యేకత వ్యక్తిత్వానికి పుష్టి. ఇట్టి ప్రత్యేకతను సాధించుకున్నవారు చిత్తస్థైర్యంతో ముందుకు సాగిపోతూ ఉంటారు. ●

## విస్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83, మార్చి '83: ఫిబ్రవరి '84 నుంచీ డిసెంబరు '84: జనవరి '85 నుంచీ మే '85 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీల వెల రూ. 1.75 లు, 1984 కాపీల వెల రూ. 13.00 లు: 1985 కాపీల వెల రూ. 6.25 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతోపాటు రూ. 2.75 చేర్చి M. O. పంపాలి. 'విస్డమ్' 9, దేశికారోడ్డు, మద్రాసు-600 004.

—సర్క్యులేషన్ మేనేజర్.

"దారిద్ర్యము చేత ఎంత పీడింపబడినను
ధర్మమార్గమును తప్పకుండుట గౌరవహేతువు."

# తపాలా సర్వీసుల కథ

రాఘవేంద్రరావు

ప్రపంచంలో అమెరికా దేశస్థులు మిక్కిలి ఎక్కువగా జాబులు వ్రాసుకుంటారు. 1982 వ సంవత్సరంలో అమెరికాలో 114 బిలియన్ల ఉత్తరాలు, పార్శిల్లు (బంగీలు)



గుర్రంమీద తపాలా బట్వాడా

క్లియర్ చేయడానికి 6,69,657 మంది జనం' 1,88,982 కార్లు, ట్రక్కులు వినియోగింప బడ్డాయి। ఈ లెక్క ప్రకారం సంవత్సరానికి సరాసరి తలసరి 494 ఉత్తరాలు తేలతాయి. 1840 వ సంవత్సరం దాకా అసలు తపాలా బిళ్ళలే లేని ప్రపంచంలో దీని చరిత్ర ఇంకా ఎంత పెద్దదిగా ఉంటుందో, ఈమధ్య 1985 సం. జూలైలో బ్రిటిష్ పోస్ట్ ఆఫీసు రాయల్ మెయిల్ సర్వీసు 350 వ వార్షికోత్సవాన్ని అత్యంత వైభవంగా జరుపుకుంది.

1635 వ సం. జూలై మాసంలో 1 వ చార్లెస్ రాజు తన స్వంత క్యూరియర్ (వార్తా వాహకుడు) సర్వీసును ప్రజల సౌకర్యం కోసం ప్రారంభించాడు. ఆ నాడు పోస్ట్ ఆఫీసులు లేవు. ఉత్తరాలు బట్వాడా చేయడానికి పోస్ట్‌మెన్ సౌకర్యం లేదు. స్థానికంగా ఎర్పాటైన దివాణంలోనో, సత్రంలోనో సేకరించబడ్డ ఉత్తరాలు ఎవరికివారు వెళ్ళి తీసుకోవలసి వచ్చేది.

సమకాలీన భారతదేశంలో కూడా తపాలా సౌకర్యాలు ఎంతమాత్రం మెరుగ్గా లేవు. అతి దుర్ఘటము, కష్టసాధ్యం అయిన ఈ పని తపాలా రన్నర్లు చేపట్టేవారు. ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుకోడం రాజులకు మాత్రమే చెల్లుతూ ఉండేది. అక్బరు (1542-1605) వార్తా వాహకులకు 130 మొదలు 145 కి.మీ దూరం ప్రయాణించడానికి 24 గంటలు పట్టింది.

ఆంగ్ల భాషలో మొట్టమొదట 'పోస్టు' అంటే ఒక విధమైన తోలుసంచి అని అర్థం. కానీ ఈ పోస్టు అనే పదం లాటిన్ భాషలో పాసిటస్ (స్థిర ప్రదేశం) అనే పదం నుంచే వచ్చింది. వేలకొలది మైళ్ళ దూరం ప్రయాణంచేసే ఉత్తరాలకు ఈ మాటకు ఉండే సంబంధం వింతగానే కనిపిస్తుంది. కాని ఈ

---

"తన అంతస్తునకు తగిన వేషము గలిగి యుండుట మేలు,
తన్నుతాను పొగడుకొనక ఉండుట - ఉచితము."

స్థిర ప్రదేశాల, స్థావరాలవల్ల ఉత్తరాలను శీఘ్రంగా పంపడానికి వీలు కలిగేది.

ఇజబెల్లా మహారాణికి కొలంబస్ ప్రయాణం విషయం 5 నెలలకు తరువాత



ఉత్తరాలు తీసుకుపోతున్న పావురం

తెలిసింది. 1865 వ సంవత్సరంలో లింకన్ హత్య యూరప్‌లో తెలియడానికి 2 వారాలు పట్టింది. ఇప్పుడు వార్తలు అతి వేగంగా తెలుస్తాయి. ఈ నాటి పోస్టు సర్వీసులు ఇంత వేగాన్ని పుంజుకోడానికి 100 సంవత్సరాలు పైనే పట్టింది.

దక్షిణఆఫ్రికా మోస్సెల్‌బే లో ఈ పోస్టల్ సర్వీసుల జ్ఞాపకార్థంగా నిర్మింపబడిన కట్టడం ఒకటుంది. ప్రాచీన కాలపు పోర్చుగీసు పాదరక్ష రూపంలో నిర్మింపబడిన ఈ మందిరం ప్రపంచంలో మొట్టమొదటి పోస్ట్‌బాక్సు జ్ఞాపకార్థం నిర్మింపబడింది.

1501 వ సం.లో పోర్చుగీసు నావికుడైన జోహోడానోవా నిర్వహణలో గల నాలుగు ఓడలు ఇండియాకు వస్తూ మోస్సెల్‌బే లో ప్రవేశించాయి. ఇక్కడ ఒక చెట్టుకు వ్రేలాడ గట్టిన షూలో ఒక ఉత్తరం కనిపించింది. పీచు కాగితంమీద వ్రాసిన ఈ ఉత్తరం విప్పి చదివితే బార్తొలోమ్యూ డయాస్ అనే పోర్చుగీసు నావికుడు అంతకు ముందు సంవత్సరంలో ప్రయాణం చేస్తూ అక్కడ సంభవించిన పెద్ద తుఫానులో మునిగిపోయినట్టు సమాచారం వ్రాసిపెట్టబడి ఉంది. ఆ ఘోర ప్రమాదంలో బ్రతికి బయటబడ్డ ఒక వ్యక్తి ఆ సంఘటనను వివరంగా వ్రాసి ఎవరైనా చూసినవారు చదివి తెలుసుకుంటారని ఒక 'షూ'లో భద్రంగా పెట్టి ఒక చెట్టుకు ఆ

## మీ గురించి పది నిర్ణయాలు తీసుకుంటారు

మీరు ఒక ఆఫీసు రూముకి వెళ్ళినప్పుడు గానీ, ఏదైనా ఇంటర్వ్యూకి వెళ్ళినప్పుడుగానీ మీ పరిచయం లేకపోయినా మీ వైఖరినిబట్టి నికరంగా ఈ పది నిర్ణయాలు తీసుకుంటారు.

1. మీ ఆర్థికస్థాయి.
2. మీ విద్యాస్థాయి.
3. మీ నాణ్యత.
4. మీ సాంఘిక గౌరవం.
5. మీ నాగరికత.
6. మీకు సంక్రమించిన పిత్రార్జితం.
7. మీకు సంక్రమించిన విద్యాబుద్ధులు.
8. మీకు సంక్రమించిన సాంఘిక మర్యాద.
9. మీ విజయం.
10. మీ నైతిక ధర్మ ప్రవర్తన.

---

"ఓడ సముద్రమును దాటుటకెట్లు సాధనముగా నున్నదో,
అట్లే సత్యగుణము పాపసముద్రమును దాటుటకు సాధనమని పెద్దల వాక్కు."

'షూ'ను వ్రేలాడగట్టారు. ఇదే ఒకనాడు ప్రపంచంలో మొట్టమొదట పోస్ట్‌బాక్స్ కాగలదని ఆ నావికుడు కలలో కూడా అనుకోలేదు.



రౌలండ్ హిల్

అసలు వార్తలు పంపడం, అందుకోడం ఎప్పుడో క్రీస్తు యుగానికి ముందే ప్రారంభమైనా, సందేశాలు పంపడం అనే భావన మన భారతీయ భావనగానే తోస్తుంది. రామాయణంలో హనుమంతుడు తీసుకువెళ్ళిన వార్త హనుమత్సందేశం, మేఘుడు తీసుకువెళ్ళిన యక్ష సందేశం మేఘ సందేశం, నలుడు దమయంతికి పంపిన సందేశం హంస సందేశం. ఈ విధంగా మన సంస్కృతంలో ఎన్నో సందేశాలు ఉన్నాయి. అలాగే గ్రీకు కథలలో రన్నరులతో ప్రారంభమైంది. 356-323 బి.సి.లో అలెగ్జాండరు నియోగించిన ఫిలోనిడెస్ అనే రన్నరు 9 గంటలలో 86 కి.మీ. ప్రయాణం చేసాడట.

సలామిస్ విజయం తరువాత పవిత్ర జ్యోతిని తేవడానికి డెల్ఫాస్‌కు పంపబడిన యుకిడాస్ ఒక్క రోజులో 200 కి. మీ. పరుగెత్తి దివ్యజ్యోతిని తెచ్చి ఇచ్చి వెంటనే మరణించాడు. డారియస్ నాయకత్వంలో పర్షియనులు గ్రీసును దండెత్తినప్పుడు స్పార్టనుల సహాయం కోసం పంపబడిన ఫిడిప్పస్ చాలాదూరం పరుగెత్తాడు. ఫిడిప్పస్ ఒకటిన్నర రోజులలో 240 కి.మీ. దూరం స్పార్టా (sparta) కు వెళ్ళి తిరిగి వచ్చాడట. ఈ సమయంలో చైనాలో ప్రజలు తమ తపాలా సౌకర్యాలను తామే ఏర్పరచుకున్నారు. చైనావారు పావురాలను పెంచి వాటికి ఉత్తరాలను తీసుకువెళ్ళడానికి తగిన శిక్షణ ఇచ్చారు. వారు వ్రాసిన ఉత్తరాలను చుట్టగా చుట్టి వాటిని పావురాల తోక మధ్య ఈకలకు కట్టేవారు. 8 వ శతాబ్దంలో అరబ్బులకు పావురాల ద్వారా ఉత్తరాలు పంపడం ఒక కళగా రూపొందింది. దీనిని యూరపులో ప్రవేశపెట్టారు. ఈనాడు కూడా దక్షిణ పసిఫిక్ మహాసముద్రపు కొన్ని ప్రదేశాలలో చుట్టుపట్ల ద్వీపాలకు ఉత్తరాలు పంపడానికి ఇదే విధానం అవలంబిస్తున్నారు. ఇటీవల 1931 లో దక్షిణ వియట్‌నామ్ సైగాన్ నుండి ఫ్రాన్స్‌లో అర్రాస్‌కు 11,200 కి. మీ. దూరం 7 రోజులలో ఒక పావురం ప్రయాణం పూర్తి చేసింది!

పోస్టల్ విధానంలో తరువాత ఒక విప్లవం బయలుదేరింది. మే 1, 1840 న లండన్‌లో వేలకొద్దీ జనం జనరల్ పోస్టాఫీసు దగ్గర పోస్టేజి స్టాంపులను కొన

---

"కార్యంబులందు కష్టంబుల నోర్చి కొంచెము
సుఖంబె నను అ మేలు."

డానికి మూగారు. ఇది కనిపెట్టింది రౌలండ్ హిల్. ఇతడు ఒక ఉపాధ్యాయుని కుమారుడు. రాణిగారికి ఇతడే కమీషనర్. 1837లో 'పోస్ట్ ఆఫీస్ రిఫారమ్స్' అనే గ్రంథం రచించాడు.

రౌలండ్ హిల్ ప్రవేశపెట్టిన పోస్టేజి స్టాంపులు 12 సం. తరువాత ఇండియాలో కూడా ప్రారంభమయాయి మొట్టమొదట ఈస్ట్ ఇండియా కంపెనీ 1852 లో కరాచీలో పోస్టేజి స్టాంపులను జారీచేశారు. ఇవి సింథ్ ప్రాంతంలో మాత్రమే చెల్లేవి. 1854 లో ఈస్ట్ ఇండియ కంపెనీ పోస్టల్ సర్వీసులను డైరక్టర్ జనరల్ ఆధ్వర్యంలో ప్రత్యేక సంస్థగా ఏర్పరచారు. ఇండియా అంతా చెల్లుబడి అయే స్టాంపులు జారీచేశారు. 1864లో స్థాపించబడినవి 662 పోస్టాఫీస్‌లు. దేశమంతటా ఈనాడు 1,40,435 పోస్టాఫీసు లున్నాయి. ప్రపంచపు మొట్టమొదటి ఎయిర్ మెయిల్ సర్వీసు 1911 ఫిబ్రవరిలో కాప్టెన్ వాల్టర్ విండ్‌హామ్, హెన్రీ పెక్వెట్ అనే ఫ్రెంచి పైలట్‌లు అలహాబాద్ నుండి హంబర్ బై ప్లేన్‌లో మెయిల్ సంచులు తీసుకు వెళ్ళి నైనీలో పోస్టాఫీసుకు చేర్చారు.

న్యూయార్కు జనరల్ పోస్ట్ ఆఫీస్‌లో పోస్టల్ విధానానికి వర్తించే హిరోడోటస్ శాసనం - "ఎండ, గాలి, వాన, రాత్రి అనక అతి శీఘ్రంగా ఉత్తరాలు బట్వాడా చెయ్యబడును" - ద్వారా 500 బి. సి. లో గ్రీకులు దాడి చేసినప్పుడు పర్షియన్‌లు పోస్టల్ క్యూరియర్స్‌ను ఉపయోగించినట్లు తెలుస్తూంది.

---

(2 వ పేజీ తరువాయి)

లకు. చెప్పే మాటలకు అనువర్తించు కుంటే పరమాత్ముని దివ్యసందేశం అఖండ జ్యోతిగా దేదీప్తిగా ప్రకాశిస్తుంది

ఈ అఖండజ్యోతిలో మానవుడు తన వెనుకటి తప్పులను విమర్శించుకో గలుగుతాడు జీవితంలో సౌందర్యం, సత్యం, పవిత్రత తెలిసివస్తాయి. మానవుడు మరింత ఉదాత్తుడుగా ప్రవర్తించ గలుగుతాడు

---

## భారత దేశంలో బాల కార్మికుల సంఖ్య అధికం



ఇంటర్ నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ అంచనా ప్రకారం ప్రపంచంలో భారతదేశం ఎక్కువ బాల కార్మికులను - 165 లక్షల మందిని - వినియోగిస్తూంది. వీరు 8 సం.లు మొదలు 15 సం.ల వయస్సుమధ్య ఉంటారు.

"ఉత్తముడుగా మండువాడు తన్నితరులు పొగడినను దానికి సంతోషించడు."

# మీకు తెలుసా?

**చైనా కరెన్సీ:**

చైనా దేశంలో చెలామణిలో ఉన్న కరెన్సీ యువాన్ (yuan).

* * *

**లెగసీ అంటే:**

మరణశాసన పూర్వకంగా ఇచ్చే ప్రత్యేకమైన వస్తువు లేక సొమ్ము.

* * *

**రక్తపోటు నివారణకు ఔషధం:**

రక్తపోటు నివారణకు ఔషధం 'సర్పగంధి' (Rawolfia Serpentina) అనే మూలికా విశేషంనుంచి తయారు అవుతుంది.



**చంద్రుని వద్ద రాత్రింబవళ్ళు:**

చంద్రునివద్ద రాత్రింబవళ్ళు సుమారు రెండేసి వారాలు.

**ఒక్కసారి పరిభ్రమించడానికి 84 సంవత్సరాలు:**

సూర్యుని చుట్టూ ఒక్కసారి తిరగడానికి యురేనస్ గ్రహానికి 84 సంవత్సరాలు పడుతుంది.

* * *

**ఇనుప ఖనిజం:**

ప్రపంచంలో దక్షిణ అమెరికా బ్రెజిల్‌లో ఇనుప ఖనిజం మిక్కిలి ఎక్కువ.

* * *

**గాజుతో బాగా అతుక్కునే లోహం:**

క్రోమియం లోహం గాజుతో చక్కగా అతుక్కుంటుంది.

* * *

**'జైహింద్':**

తొలిసారిగా 'జైహింద్' అనే పదాన్ని ఉపయోగించిన భారత వీరుడు సుభాష్‌చంద్ర బోస్.

* * *

**మొదటి రక్షణ మంత్రి:**

భారత దేశం 1947 వ సం.లో స్వాతంత్ర్యం పొందిన తరువాత తొలి రక్షణ మంత్రి బల్‌దేవ్‌సింగ్.

* * *

(మిగతా 57 వ పేజీలో)

"బొగ్గులకొరకు చెట్లను మొదలంటా నరుకకూడదు."

# సంగీత త్రిమూర్తులు

## శ్రీ ముత్తుస్వామి దీక్షితులు

సంగీత త్రిమూర్తులనే రత్నత్రయం అని కూడా అంటారు. ఈ రత్నత్రయంలో వయస్సునుబట్టి శ్రీ శ్యామశాస్త్రి, శ్రీ త్యాగరాజు తరువాత స్మరింపదగిన వాగ్గేయ కారకుడు శ్రీ ముత్తుస్వామి దీక్షితులు (1776- 835).



శ్రీ ముత్తుస్వామి దీక్షితులు

ఒక్క సంగీతంలోనే కాక అన్ని శాస్త్రాలలోనూ పరిపూర్ణ పాండిత్యం సంపాదించాడు. ఇతడి జన్మస్థలం కూడా తిరువారూరే. వైదీశ్వరన్ కోయిల్ అనే గ్రామంలో అమ్మవారు, బాలాంబ వరప్రసాదుడైన కారణజన్ముడు. చిదంబరనాథస్వామి అనే సన్యాసి సంబంధము ఇతడి సంగీత రచనకు మూల కారణం. అనేక దివ్యక్షేత్రాలను సందర్శించి, అనేక తీర్థయాత్రలు కొనసాగించి ఆయా స్థలాలలో వేంచేసియున్న దైవతములపై అనేక కీర్తనలు రచించాడు. ఒక్క కర్ణాటక సంగీతమేగాక హిందుస్థానీ సంగీతం, పాశ్చాత్య సంగీతం తెలుసుకున్నాడు. సంస్కృతం, తెలుగు, తమిళ భాషలలో ఇతడి పాండిత్యం అపారం. సంస్కృతంలోనే ఎక్కువగా కీర్తనలు రచించినా కొన్ని తెలుగులోను, మరికొన్ని సంస్కృతం, తెలుగు, తమిళం కలిపి రచనలు సాగించాడు.

ఇతడి పూర్వీకులు గుడియాత్తం దగ్గర

## కుతుబ్ మినార్ నీడ పడదు

ప్రతి సంవత్సరం జూన్ 22 న తేదీన ఢిల్లీ మెహరేలీలో చారిత్రక ప్రసిద్ధమైన కుతుబ్ మినార్ నీడ పడదు. ఉత్తర అక్షాంశ రేఖకు 28.5° డిగ్రీలలో ఉండటం చేత, దాని నిర్మాణం లంబానికి 5 డిగ్రీల వాలుగా ఉండటంవల్ల భూమధ్య రేఖకు ఇరుప్రక్కల సూర్యుడు తిరుగుతూ ఉండటంవల్ల దీని నీడ పడదని సుప్రసిద్ధ భూగర్భ శాస్త్రవేత్త జె.పి. శ్రీవాస్తవ అంటున్నారు.

"ప్రతి నిమిషం సద్వినియోగం చేసుకుంటే గంటలు తామంతట అవే సద్వినియోగం కాగలవు." -చెస్టర్ ఫీల్డ్

విరించిపురం అనే గ్రామం నుండి 1742 వ సం.లో తంజావూరు వలస వచ్చారు. తండ్రి రామస్వామి దీక్షితులు, తల్లి సుబ్బులక్ష్మి అమ్మాళ్ శ్రీరామస్వామి దీక్షితులు 'చతుర్దండి ప్రకాశిక' అనే సుప్రసిద్ధ సంగీత శాస్త్ర గ్రంథం రచించిన ('సంగీత సుధ' రచించిన గోవింద దీక్షితుల కుమారుడు) వెంకట మఖిని ఆశ్రయించి 72 మేళరాగాలు, జన్య రాగాలు నేర్చుకున్నాడు. తంజావూరు రాజు ఆదరాభిమానాలతో తిరువారూరులో శ్రీ త్యాగరాజస్వామి దేవాలయంలో సంగీత కచేరీలు జరిపిస్తూ ఉండేవాడు. హంసధ్వని రాగం కనిపెట్టి సంగీత విద్వాంసుడే శ్రీ రామస్వామి దీక్షితులు.

రామస్వామి దీక్షితులు, సుబ్బులక్ష్మి అమ్మాళ్ దంపతులకు వైదీశ్వరన్ కోవెలలో గల బాలాంబికా దేవి స్వప్నంలో కనిపించి ఒక ముత్యాలహారాన్ని ప్రసాదించిందట. ఆ దేవి అనుగ్రహంవల్ల 1776 వ సం.లో వీరికి ఒక పుత్రుడు జన్మించాడు. రామస్వామి దీక్షితులు కుమారునికి వైదీశ్వరన్ కోవెలలో వెలసిన ముత్తు కుమారస్వామి - కార్తికేయుడు - పేరుపెట్టి ముత్తు కుమారస్వామి అని పిలుస్తూ ఉండేవారు. అమ్మవారు ముత్యాలహారం స్వప్నంలో ప్రసాదించింది కాబట్టి తమిళంలో ముత్యాన్ని ముత్తు అంటారు కాబట్టి ఇతని తల్లిదండ్రులు తమ కుమారునికి ముద్దుగా 'ముత్తుస్వామి' అని పేరు పెట్టారు.

ఇతడు వేదాధ్యయనంతో బాటు సంస్కృత భాషను కూడా అభ్యసించాడు. తండ్రివద్ద సంగీతాన్ని నేర్చుకుని అపారమైన పాండిత్యాన్ని సంపాదించి అచిరకాలంలోనే గొప్ప వాగ్గేయ కారకుడుగా, గాయకుడుగా ప్రసిద్ధిని పొంది, వీణావాయిద్యమందు అపూర్వ నైపుణ్యాన్ని సంపాదించాడు

తండ్రి, శ్రీ రామస్వామి దీక్షితులు మద్రాసు దగ్గరి మణలి ఆస్థానాధిపతి ముత్తుకృష్ణ మొదలియారు ఆహ్వానంపై వారి ఆస్థానంలో సంగీత విద్వాంసుడుగా చేరు

## 13 వ శతాబ్దం నుంచీ క్రికెట్ ఆడబడుతూంది



13 వ శతాబ్దం నుంచీ ఆడబడుతూన్న క్రికెట్ ఆట 18 వ శతాబ్దం మధ్య భాగంలో ప్రస్తుత విధంగా మార్చబడింది. క్రికెట్ అనే మాట 1598 లో పాత ఫ్రెంచి భాషలో క్రిక్కెట్ (creckett) నుంచి వచ్చింది.

"ఆశయం లేకపోతే ప్రయత్నించరు,
ప్రయత్నం లేకపోతే విజయం సాధించ లేరు."

కున్నాడు. ముత్తుకృష్ణ మొదలియారు గతించిన తరువాత ఆయన కుమారుడు వేంకటకృష్ణ మొదలియారు రామస్వామి దీక్షితుల కుటుంబాన్ని తండ్రిని మించి గౌరవించాడు. ఈ ప్రభువు సహాయంతో శ్రీ ముత్తుస్వామి దీక్షితులు మద్రాసు సెంట్ జార్జి కోటకు వచ్చి పాశ్చాత్య సంగీత మర్మాలను గ్రహించాడు. 'గాడ్ సేవ్ ది కింగ్' అనే ఆంగ్ల పాటకి అనుగుణంగా సంస్కృత సాహిత్య శబ్దాన్ని సమకూర్చాడు. పాశ్చాత్య సంగీత పరిచయంవల్ల కర్ణాటక సంగీతానికి ఫిడేలు ప్రక్కవాద్యంగా స్వీకరించి పుష్టి నొందించాడు.

దీక్షితులు మణలి ఆస్థానంలో ఉంటూండగానే చిదంబరనాథ యోగి అనే సిద్ధుడు మణలికి వచ్చి దీక్షితులకు మహామంత్రాన్ని ఉపదేశించాడు. తరువాత ముత్తుస్వామి దీక్షితులు చిదంబర యోగితో చేరి కాశీయాత్రకు బయలుదేరాడు. అక్కడ ఈ యోగి వలన శ్రీవిద్యోపదేశం పొంది, అష్టసిద్ధులను సంపాదించాడు. ఇక్కడ దీక్షితులు హిందుస్థానీ సంగీతాన్ని శ్రద్ధగా విని అందలి మెళకువలను అవగాహన చేసుకున్నాడు. బృందావన సారంగ రాగంలో రచించిన 'రంగపుర విహార' కృతిలో ఇతడి హిందూస్థానీ సంగీత జ్ఞానం తెలుస్తుంది. యోగీంద్రుడు దీక్షితుల దీక్షకు మెచ్చి ఒక అపూర్వ వీణను తన ఆశీస్సులతో అనుగ్రహించాడు. ఈ ప్రత్యేక వీణకు యాళిముఖము పైకి తిరిగి ఉంటుంది. ఇది నేటికీ శ్రీ ముత్తుస్వామి దీక్షితులవారి వంశంలో ఉంది.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు గురువుగారి అనుజ్ఞనుపొంది తిరువారూరుకు బయలుదేరాడు. దారిలో తిరుత్తణి దేవాలయం సంద



శ్రీ దీక్షితులవారి వీణ

ర్శించి సుబ్రహ్మణేశ్వరుని సన్నిధిలో సేవలు చేస్తూ ఉండగా ఒకనాడు చెంగల్వరాయుడు అనే ముసలి బ్రాహ్మణుడు దీక్షితులను నోరు తెరవమని నోటిలో పటికబెల్లం పెట్టి మాయ

## మిషనరీ కార్యకలాపాలకు 1500 లక్షల డాలర్ల విరాళం

హాలండ్‌లో గొప్ప శ్రీమంతుడు పియట్ డెర్క్సన్ మూడవ ప్రపంచ దేశాల (అభివృద్ధి పొందుతున్న దేశాలు)లో రోగులనూ, దరిద్రులనూ ఆదుకునే మిషనరీ కార్యకలాపాలకు సుమారు 1500 లక్షల డాలర్ల విరాళం ఇచ్చాడు. "ఇన్నాళ్ళు ఈ భాగ్యం అంతా నా తలకు కట్టిన రాతిబండలా ఉంది. ఈ నాటికి వదల్చుకో కలిగాను, హాయిగా ఉంది" అన్నాడు డెర్క్సన్

"యాచకుల కిచ్చి వెనుక ఇచ్చితినని చింతింపకుండుట దాన మార్గము."

మయ్యారట. వెంటనే శ్రీ ముత్తుస్వామి దీక్షితులు అమితానందంతో సుబ్రహ్మణ్యస్వామే ఆ రూపంలో దర్శన మిచ్చారని గ్రహించి సుబ్రహ్మణ్య స్వామిని 'గురు గుహ' అని సంబోధిస్తూ తిరుత్తణి (గురుగుహ) కృతులు రచించాడు. మాయా మాళవగౌళలో 'శ్రీనాథాది గురుగుహో జయతి జయతి', ఆనందభైరవిలో 'మానస గురుగుహ రూపం భజరేరే' మొదలైన ఎనిమిది కీర్తనలను ప్రత్యేకంగా రచించాడు. ఇవి ప్రథమ, ద్వితీయ, తృతీయ....సంబోధన విభక్తులను ఉదహరిస్తూ చమత్కారంగా ఉంటాయి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితులు తిరుత్తణి నుండి బయలుదేరి తిరుపతి క్షేత్రంలో శ్రీ వేంకటేశ్వరస్వామిని దర్శించి (తిరుపతి వేంకటేశ్వరస్వామి దీక్షితులవారి కుల దైవము) "శేషాచల నాయకం భజామి" అనే కీర్తన వరాళి రాగంలో రచించాడు. తిరుపతి నుండి శ్రీ కాళహస్తికి వెంచేసి శ్రీకాళహస్తీశ్వరుని స్తుతించి కాంచీపురం చేరుకున్నాడు. ఇచ్చటి శ్రీ కామాక్షీదేవిని, ఏకామ్రేశ్వరుని సేవిస్తూ మనోహరి రాగంలో 'కంజదళాయతాక్షి', హిందోళంలో 'నీరజాక్షి కామాక్షి', సరస్వతీ మనోహరి రాగంలో 'సరస్వతీ మనోహరి', శుద్ధ సావేరిలో 'ఏకామ్రేశనాయికే' అని కీర్తించిన కీర్తనలు ప్రసిద్ధమైనవి. ఇచ్చటి వరదరాజస్వామిని కూడా కీర్తించాడు. ఇతడు తీర్థయాత్రలు చేస్తూ పరమత ద్వేషం లేకుండా శైవ, వైష్ణవ ఆలయాలు రెంటినీ సందర్శించి భక్తి జ్ఞానవైరాగ్య భావాలతో అనేక కీర్తనలను అతి మనోహరంగా, అతి సుందరంగా రచించాడు. ఇతడు హరిహర భేదం ఎరుగని అద్వైతి. స్మార్త మతస్థుడు. శ్రీ త్యాగరాజు తారక మంత్రోపదేశాన్ని పొందిన ఉపనిషద్బ్రహ్మేంద్రులు రచించిన 'రామాష్టపది'కి ఇతడు రాగతాళాదులను ఏర్పరచాడు. శ్రీ రామభక్తితో మగ్నుడై 'రామచంద్రేన

## కత్తి కంటే ఎంతో వాడి



అనేక శతాబ్దాల తరబడి వ్రాతలవల్ల అనేక ఇబ్బందులు, ఇక్కట్లు ఏర్పడ్డాయి. మార్టిన్ లూథర్ వ్రాసిన ౯౫ అసమ్మతి పత్రాలవల్ల ప్రొటెస్టాంట్, కాథలిక్కుల పోరాటాలు ప్రారంభమయ్యాయి. వాల్టైర్, రూసో, మాంటెస్క్యూ రచనలవల్ల ఘోరమైన ఫ్రెంచి విప్లవం ఏర్పడింది. ఇదే విధంగా డాస్టోవిస్కీ రచనలవల్ల రష్యా విప్లవం చైతన్యవంతమై రష్యా చక్రవర్తి జారును వణికించాయి.

"అహింస, సత్యం, అచౌర్యం, పరిశుద్ధత, మనోనిగ్రహం, శక్తి, శాంతి అందరూ అనుసరించవలసిన సద్గుణాలు." —యాజ్ఞవల్క్య

సంరక్షితోహం' (మాంజిరాగం) అనే కీర్తనలో శ్రీరామచంద్రమూర్తి త్రిమూర్తుల సమిష్టి రూపమనియు, 'మామవ రఘువీర' (మాహారిరాగం) అనే సంకీర్తనలో శ్రీ రామచంద్రమూర్తే పరబ్రహ్మమని శివాదులు చెప్పినట్లు శ్రీరాముడు పామరపండిత పావన కర నామధేయుడని వర్ణించాడు.

ఆ తరువాత ఇతడు తిరువారూరులో స్థిరనివాసం ఏర్పరచుటకు ముందు పంచలింగ క్షేత్రములలో వెలసిన ఈశ్వరమూర్తుల మీద అనేక సంస్కృత కీర్తనలను రచించాడు. చిదంబర నటరాజస్వామిపై ఇతడి 'ఆనంద నటన ప్రకాశం' అనే కేదారగౌళ రాగంలో కీర్తన అత్యంత రమణీయంగా నాట్యానికి అనువుగా ఉంటుంది.

తిరువారూరులో స్థిరనివాసం ఏర్పరచు కుని అచ్చటి శ్రీ త్యాగరాజ, కమలాంబ, శ్రీ నీలోత్పలాంబ, శ్రీ గణేశ, శ్రీ సుబ్రహ్మణ్యస్వామి మొదలైన దేవతములపై రచించిన అనేక కీర్తనలు, కృతులు కర్ణాటక సంగీతమున సుప్రసిద్ధములు. ఇతడు శ్రీ త్యాగరాజస్వామిపై రచించిన "త్యాగరాజో విరాజితే, త్యాగరాజం భజరే, త్యాగరాజేన సంరక్షితోహం, త్యాగరాజాయ నమస్తే ..." అనేవి విభక్తి కృతులు.

ఇతడు రచించిన నవావరణ కీర్తనలు జగత్ప్రసిద్ధములు. వీటియందు శ్రీ దీక్షితుల ప్రతిభ పతాకస్థాయిని అందుకుంది. ఇతనికి గల మంత్ర శాస్త్ర పాండిత్యం దేవతాప్రతిమల లక్షణ విజ్ఞానం వీటియందు విదితమవుతుంది. ఇతడి నవగ్రహ కీర్తనలలో ఇతడి జ్యోతిష శాస్త్ర పాండిత్యం ద్యోతకమవుతుంది.

ఎట్టయాపురంలో సంగీత విద్వాంసుడుగా ఉన్న తన తమ్ముడు బాలస్వామి దీక్షితులను చూడాలని బయలుదేరి దారిలో వర్షంలేక ఏర్పడిన క్షామ పరిస్థితులను చూసి అమృత వర్షిణి రాగంలో 'ఆనందామృత కర్షిణి', 'అమృతవర్షిణి హరాది పూజితే శివే భవాని

(మిగతా 49 వ పేజీలో)

# అమెరికా వ్యోమగామి శూన్యంలో పర్యటించాడు



జూన్ 3, 1965 న అంతరాళంలోకి పంప బడిన అమెరికా అంతరిక్షపు నౌక జెమిని-4, భూమి చుట్టూ 4 రోజులలో 62 సార్లు చుట్టింది. ఈ అంతరిక్ష ప్రయాణంలో 21 నిమిషాలపాటు వ్యోమగామి వైట్, నౌకను వీడి శూన్యంలో అంతరిక్ష "గన్"తో అతి నైపుణ్యంగా ప్రవర్తించగలిగాడు. 61.28 సెం. పొడుపైన గొట్టాలతుండే సన్నపెట్టె ద్వారా ఓ అదిలో వచ్చే ప్రాణవాయువు తీవికి చోదకశక్తి.

"మెడ ఉంటే కాడి సిద్ధంగా ఉంటుంది

# అందరికీ ఆహార నియమం

డా. పి. జి. చిన్నకృష్ణన్



[డా. పి.జి. చిన్నకృష్ణన్ పేరుపొందిన మద్రాసు సిద్ధ వైద్య నిపుణులు. చెస్ట్ ఫిజిషియన్. సన్నబడేందుకు మద్రాసులో స్లిమ్మింగ్ యూనిట్‌ను నడుపుతున్నారు.]

డైటింగ్ అంటే ఆహార నియమం. అన్ని వయస్సులలో అందరూ సన్నబడటానికి నిబంధనల ప్రకారం ఆహారాన్ని తీసుకోవడం. మితిమీరి తినడం వల్ల శరీరంలో అదనపు కెలోరీలు క్రొవ్వుగా మారి కడుపులోను శరీరం క్రింది భాగాలలోను పేరుకుంటాయి. పురుషులు గానీ, స్త్రీలుగానీ బాగా స్థూలంగా ఉంటే బద్ధకానికి, ఇతర అనేక రోగాలకు గురి అవుతారు. ముఖ్యంగా 40, 45 సంవత్సరాల వయస్సులో స్థూల శరీరం కలవారు సాధారణంగా రక్తపుపోటు (High Blood Pressure) మధుమేహము (Diabetes), గుండెపోటు (Heart attack), కీళ్ళ నొప్పులు (Joint pains), త్వరగా నడిచేటప్పుడుగాని. మేడ మెట్లు ఎక్కేటప్పుడుగాని ఊపిరి పీల్చుకోడానికి కష్టపడడం మొదలైన రోగాలతో బాధపడతారు. ఎప్పుడూ ఉత్సాహంగా నిత్యయౌవనంతో తాజాగా వుండాలంటేమీ స్థూల శరీరాన్ని కృశింపజేసుకోడానికి కొన్ని నిబంధనలను పాటించాలి. అందంగా, సన్నగా, శరీర సౌష్టవంతో ఉండాలంటే—

1. ప్రతిరోజూ అద్దంలో మీ ప్రతిబింబాన్ని చూడుకో నీవు కావాలనుకునేటంత సన్నబడ్డావో లేదో గమనిస్తూ ఉండాలి.

2. ప్రతివారం బరువును చూసుకోవాలి.

3. కెలోరీ రెకనర్‌ను చూచుకుంటూ

---

## మిక్కిలి పెద్ద ఉక్కు కర్మాగారం

జపాన్ టోకియోలో నిప్పాన్ ఉక్కు కర్మాగారం ప్రపంచంలో మిక్కిలి పెద్ద ఉక్కు కర్మాగారం. 1983 వ సం.లో 288.5 లక్షల టన్నుల ముడి ఉక్కును ఈ కర్మాగారం తయారుచేసింది.

"అపజయానికి సిద్ధమై, ఉత్తమమైనదాన్ని ఆశిస్తూ, లభించిన దాన్ని గ్రహించాలి." —రాబర్ట్. ఇ. స్పీర్

ఉంటే ప్రతిదినం మీరు ఎన్ని కెలోరీలు వినియోగించుకుంటున్నది తెలుస్తుంది.



4. వ్యాయామం చాలా ముఖ్యం. నాట్యం ఉత్తమమైనది. ఆటలు, నడకకూడా మంచివే. ఏ వ్యాయామం-నాట్యం, నడక-అయినా ప్రతీ రోజూ జీవితాంతం 30 మొదలు 60 నిమిషాల పాటు చేయడం అభ్యాసం చేసుకోవాలి. మంచి (కెలోరీ) పుష్టినిచ్చే ఆహారం తిని వ్యాయామం చేయకూడదు. ఈత, షటిల్ కాక్, టెన్నిస్, బాట్‌మింటన్ మొదలైనవి మంచి ఆటలు.

ఔషధాలు: శరీరాన్ని తగ్గించుకోడానికి ఔషధాలు లేకపోలేదు. కానివాటివల్ల క్రొత్త ఇతర బాధలు కలుగుతూంటాయి. తిండిని తగ్గించుకోలేక బాగా తింటూగాని ఉండలేని వారికి ఔషధాలే శరణ్యం. ఈ ఔషధాలు సాధారణంగా మెదడులో సంతృప్తిని కలిగించే కేంద్రనాడులమీద పనిచేస్తాయి.

6. సైకోథెరపి (మనస్తత్వ వైద్యం): ఇది కొందరికే మంచిది. అందరికీ పనికిరాదు. ముఖ్యంగా ఘోర ప్రమాదం వల్ల సంభవించే ట్రామా (trauma) లేక మానసికంగా కలిగిన దెబ్బవల్ల అధికంగా ఆహారం తినేవారికి మానసిక విశ్లేషణ (psycho analysis) కృత్రిమంగా నిద్ర తెప్పించడం (hypnosis) మొదలైనవి ఉపకరిస్తాయి.

7. వంశలక్షణం: బాగా పెరిగిపోయి స్థూలశరీరాలతో ఉండే తలిదండ్రులు కూడా తమ పిల్లలను ఎక్కువగా ఆహారం తిననీయకూడదు. ఊరికే ముద్దుచేసి మిఠాయిలు, చాక్‌లెట్లు అధికంగా పంచదార తినిపించడం, ఎక్కువగా వెన్న, నెయ్యి ఉపయోగం మాన్పించాలి. ఇంట్లో ఎప్పుడూ బాగా నూనెలో వేయించిన వేపుళ్ళు చేయవద్దు. ఆవిరిమీద లేకపోతే ఉడికిన పదార్థాలు, ఇడ్లీలవంటివి పెట్టాలి. నెయ్యి లేకుండా కాల్చిన చపాతీలు, ఆకుకూరలు, వెన్నతీసిన పాలు మంచివి. అందరూ చేసే మరో తప్పు ఏమిటంటే క్రొత్తగా ప్రసవించిన తల్లులకు కావలసిన దానికంటే అధికంగా ఆహారం తినిపించడం. దీనివల్ల శరీరం పెరిగిపోతుంది. ఇది తెలియక ప్రసవించిన తరువాత ఒళ్ళు చేసింది అంటారు.

8. ఇంటివైద్యుని సలహా ముఖ్యం: వైద్యుణ్ణి సంప్రతించి పరీక్ష చేయించుకోకుండా ఆహార నియమం పాటించకూడదు.

## ప్రపంచంలో అతి గట్టి గుర్రు

హవాయ్ ద్వీపాలలో హానోలులుకు చెందిన స్విట్జర్ మంచి నిద్రలో పెట్టే గుర్రు 87 డెసిబిల్స్ అందుకుంది. ఇదే ప్రపంచంలో మిక్కిలి గట్టిగుర్రు అనిపించుకుంది.

హార్మోనులకు సంబంధించిన రోగాలు లేనవి నిర్ధారణ చేసుకోండి. ఆహార నియమం పాటించేముందు ఎత్తు, బరువు చూసుకోవాలి. నిర్ణయింపబడిన పట్టిక చార్టులో పరిపోల్చి



చూడండి. మీకు ఉండవలసిన బరువును చూసుకోండి. దానికి 5 మొదలు 10 పౌనులు అటు ఇటు ఉండవచ్చు. అది మీ శరీరాన్ని బట్టి ఉంటుంది. మనసారా మీ అంతట మీరు ఆహార నియమాన్ని పాటించాలి.

కొదికొదిగా ఆహారం తరచుగా తీసుకోడం మంచిది. మీరు తీసుకునే ఆహారం 12, 18 గంటలలో విభజింపబడి ఉండాలి. ఉపవాసాల వల్ల ఏర్పడే కడుపు పుండుని రానివ్వదు. రక్తపుపోటు మొదలైన రోగాలకు ఉప్పు తగ్గించి పథ్యంగా తిన్నట్టుగానే శరీరం లావుగా ఉంచే పంచదార, క్రొవ్వు పదార్థాలు బాగా తగ్గించాలి ఈ రెండే పరమ శత్రువులు. శరీరంలో కెలోరీలను బాగా పెంపొందిస్తాయి. మిఠాయిలు, పటిక బెల్లం, చాక్లెటులు. మామిడి పళ్ళు, అరటిపళ్ళు, కేకులు మొదలైన వాటిలో పంచదార, డెక్స్ట్రోసు అధికంగా ఉంటుంది పంచదార, డెక్స్ట్రోసు కెలోరీలను వృద్ధిచేస్తాయి. ఖర్జూరపు కాయలు ఆరోగ్యకరం 4 లేక 5 ఎండు ద్రాక్షపళ్ళు తింటే మలబద్ధకం ఉండదు.

తక్కువ కెలోరీలు కలవి: నిమ్మ, తియ్యనిమ్మ, ఆరెంజి తర్బూజా, పుచ్చకాయ, దోసకాయ. ఆపిల్. టొమాటో రసం, లేత కొబ్బరి నీళ్ల టీ, కాఫీ మొదలైనవి.

క్రొవ్వు పదార్థాలు: నెయ్యి, వెన్న, కొబ్బరి బాదం పప్పు, పాల మీగడ. వేరు శనగ, ఇతర నూనె గింజలు మొదలైనవన్నీ ఎక్కువగా క్రొవ్వును కలిగిస్తాయి.

బాగా విటమినులు, ప్రోటీనులు కలిగి ఉండి తక్కువ పిండిపదార్థాలు, క్రొవ్వు పదార్థాలు గల ఆహారం తీసుకోడం ఉత్తమం. వారానికి ఒకసారి ఉపవాసం ఎంతో మేలు. ఉపవాసం చేసే రోజున తక్కువ కెలోరీ విలువలుగల ద్రవపదార్థాలను మాత్రమే తీసుకోవాలి.

ఔషధాలు: ఆకలిని తగ్గించుకోడానికి

(మిగతా 56 వ పేజీలో)

## ప్రతి 10 విద్యార్థులకు ఒక అధ్యాపకుడు

రియాద్‌కు ఈశాన్యంగా 16 కి. మీ. దూరంలో దిరియాలో కింగ్ సాద్ యూనివర్శిటీ ఉంది. ఇక్కడ ప్రతి 10 మంది విద్యార్థులకు ఒక అధ్యాపకుడు ఉన్నారు. ప్రపంచంలో ఇది మిక్కిలి పెద్ద నిష్పత్తి

“తనవారు జీవించిన విధానం తెలిసే-
పరిచయం చేసుకోడానికి అవకాశం ఉండదు.”

# భారత యోగులు

## వేదవ్యాసుడు

డా. మను జి. భగత్

ప్రాచీన భారతదేశంలో రాజనీతి నిర్వహణ విధులకు, సాంఘిక, లౌకిక వ్యవహారరీతు లకు సంబంధించిన విశ్వకోశము అనదగిన



వేదవ్యాసుడు

1,00.000 శ్లోకములు గల మహాభారత సంహి తను సంస్కృతంలో రచించిన మహర్షి వేద వ్యాసుడు. 'వ్యాసుడు' అంటే కూర్పరి. ఇతర గ్రంథాలనుండి అనేక విషయాలను సంగ్రహించి వ్రాసిన మహర్షి వేదవ్యాసుడు ఒక్క కూర్పరే కాదు. వేదాన్ని నాలుగు భాగాలుగా విభజించాడు. అష్టాదశ పురాణా లను భారత సంహితను, బ్రహ్మసూ త్రాలను రచించాడు. భారతంలో ఇతడు చెప్పిన భగవ ద్గీత వంటి గ్రంథం ప్రపంచంలో మరొకటి లేదు; ఇకముందు రాదు. ఇతడు రచించిన భాగవత పురాణం హిందువులకు పారాయణ గ్రంథం. వేదవ్యాసుని జననం వశిష్ఠమహర్షి వంశం. ఇతడే వ్యాస భగవానుడు.

వేదకాలపు మహర్షులలో సుప్రసిద్ధుడు వశిష్ఠుడు. వశిష్ఠుని మనుమడు పరాశరుడు. ఒకనాడు పరాశరుడు యమునానదిని దాట వలసి వచ్చింది నావను ఎక్కాడు. ఆ నావను

---

### మిక్కిలి పెద్ద సంతతి

గ్లాకోమా ప్రోటోజోన్ (సూక్ష్మాతి సూక్ష్మమైన ఏకకణ జాతి జంతువు) రెండుగా విచ్ఛిత్తిని పొంది సంతానోత్పత్తిని కలిగి స్తుంది. ప్రతి మూడు గంటల కొక సారి విచ్ఛిత్తి ఏర్పడుతుంది. ఈ విధంగా ఒక రోజులో 8 వ తరంగా ఏర్పడ్డ పెద్ద సంతతి 510.

"వజ్ఞమలు దారె వరహితావరణమతులు."

ఒక అందమైన యువతి నడుపుతూంది. ఆమె సత్యవతి, మత్స్యకులానికి చెందినది. దాశా ర్హుని కుమార్తె. నల్లగా ఉన్నా మిక్కిలి సౌందర్యవతి, రూపవతి.

"అతీవ రూప సంపన్నాం సిద్ధానామపి కాంక్షితాం". చూసిన వెంటనే సిద్ధులు కూడా మోహింపబడేవారు. ఎంత రూపమున్నా దగ్గరకు వస్తే చేపలకంపు భరింపలేరు. అందుకే ఈమెకి 'మత్స్యగంధి' అనే పేరు. యోజన దూరం దాకా ఈ వాసన చిమ్మేది. కాబట్టి 'యోజనగంధి' అని కూడా పిలిచేవారు. పరాశరుడు ఈమె రూపలావణ్యానికి ముగ్ధుడై చూచిన వెంటనే మోహించాడు. తన తపో మహిమతో చేపల కంపుకు బదులు కస్తూరి పరిమళాలు వచ్చేటట్టు 'గంధవతి'గా చేసాడు. పరాశరుడికి సత్యవతియందు పుట్టిన కుమారుడు 'కృష్ణుడు'. నల్లగా ఉంటాడు కాబట్టే కృష్ణుడు అన్నారు. యమునానది ద్వీపంలో పుట్టడంచేత ఇతడే 'ద్వైపాయనుడు', కృష్ణ ద్వైపాయనుడు. ఇతడే వేదవ్యాసుడు.

కృష్ణద్వైపాయనుడు పెరిగి పెద్దవాడవుతున్నాడు. తల్లి సత్యవతి అనుమతిని పొంది ఆమెను విడిచి విష్వక్సేనుని దగ్గర శుశ్రూష చేస్తూ నిష్ఠతో ధర్మశాస్త్రాలను, వేదాలను పూర్తిగా నేర్చుకున్నాడు. 'జాతుకారుణ్య' అనే మరో మహర్షి దగ్గర హిందూ ధర్మాన్ని, జీవిత రహస్యాలను తెలుసుకున్నాడు. వ్యాసుడు బదరిలో ఆశ్రమాన్ని నిర్మించుకున్నాడు. ఇదే బదరికాశ్రమం. ఈ ఆశ్రమంలో ఉంటూ బాదరాయణుడు శిష్యవర్గానికి వేదమంత్ర రహస్యాలు, యజ్ఞయాగాదుల నిర్వహణ నేర్పేవాడు. అనేక తీర్థయాత్రలు సేవించాడు; అనేక పుణ్యనదులలో స్నానాలు చేసాడు: అనేకమంది శిష్యులను ఉద్ధరించాడు. ఆధ్యాత్మిక మార్గంలో మంచి విజ్ఞానాన్ని సంపాదించుకున్నాడు.

వ్యాసుడు జాబాలి మహర్షి కుమార్తె 'వాటికను' పెళ్ళిచేసుకున్నాడు. వ్యాసునకు వాటిక వల్ల కలిగిన పుత్రుడే శుకుడు: మహాయోగి.

ఈ సమయంలో హస్తినాపురాన్ని శంతనుడు అనే మహారాజు పాలిస్తూ ఉండేవాడు. శంతనునకు తన భార్య గంగాదేవి వల్ల కలిగిన పుత్రుడు గాంగేయుడు. ఇతడే దేవ

---

## ఫ్రెంచి హొకెట్ నుంచి వచ్చినది 'హాకీ'



భారత దేశపు ముఖ్య క్రీడా విశేషం హాకీ అనే మాట పాత ఫ్రెంచి హాక్వెట్ (hoquet) నుంచి ఏర్పడింది. హాక్వెట్ అంటే వంచిన కర్ర. గొల్లవాళ్ళు వాడే వంపు కర్ర.

వ్రతుడు. శంతనుని తరువాత సింహాసనాన్ని అధిష్ఠించవలసిన యువరాజు దేవవ్రతుడు అని నిర్ణయించారు. శంతనుడు వేట కోసం యమునా నది గట్టుకు వెళ్ళాడు. వేదవ్యాసుని తల్లి అయిన సత్యవతిని శంతనుడు చూచి మోహించి పెళ్ళి చేసుకోవాలని ఉబలాట పడ్డాడు. సత్యవతి తండ్రి దాశార్హుడు తన కుమార్తె సత్యవతికి పుట్టబోయే కుమారుణ్ణి యువరాజుగా చేయడానికి అంగీకరిస్తే పెళ్ళికి ఒప్పుకుంటానన్నాడు. శంతనునికి దిక్కు తోచలేదు. ప్రేమలో పడి కృంగి కృశించి పోతున్నాడు. ఎన్నో రోజులు మాసాలు గతించాయి. చివరకు దేవవ్రతుడు దాశార్హుని దగ్గరకు వెళ్ళి సింహాసనానికి తనకు గల హక్కును విరమించుకున్నట్టు, అంతే కాకుండా తనకు సంతానం కలిగి సింహాసనానికి పోటీరాకుండా ఉండేందుకు పెళ్ళిచేసుకోకుండా బ్రహ్మచారిగా ఉంటానని ప్రతిజ్ఞను చేపట్టాడు. కాబట్టే గాంగేయుడు భీష్ముడు అయ్యాడు.

శంతనుడు సత్యవతిని పెళ్ళిచేసుకున్నాడు. శంతనునికి సత్యవతివల్ల ఇద్దరు పుత్రులు కలిగారు. వీరే చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు. గంధర్వులతో జరిగిన యుద్ధంలో చిత్రాంగదుడు మరణించాడు. శంతన మహారాజు అనంతరం విచిత్రవీర్యుడు రాజ్యాన్ని చేపట్టాడు. ఇతడికి ఇద్దరు భార్యలు అంబిక, అంబాలిక. విచిత్రవీర్యుడు సంతానం లేకుండా మరణించాడు వంశం నిర్మూలం అయిపోతూంది. రాజ్యం పాలించే దిక్కులేదు. సత్యవతి భీష్ముని పిలిచి ఆనాటి సాంప్రదాయం ప్రకారం అంబిక, అంబాలికలను వివాహం చేసుకుని వంశాన్ని కాపాడి, రాజ్యభారాన్ని వహించమని వేడుకుంది. ప్రతిజ్ఞను పూనిన భీష్ముడు వివాహం చేసుకోడానికి గాని, రాజ్యం పాలించడానికిగాని ససేమిరా అంగీకరించలేదు.

సత్యవతికి ఒక ఉపాయం తోచింది. పరాశరుని వల్ల తనకు కలిగిన మొదటి పుత్రుడు కృష్ణద్వైపాయనుణ్ణి (వేదవ్యాసుడు) రాజ్యభారం వహించమంది. తన కోడళ్ళను పెళ్ళి చేసుకోమంది. వేదవ్యాసుడు తల్లి మాట కాదనలేక అంగీకరించాడు. వేదవ్యాసుని వల్ల అంబికకు ధృతరాష్ట్రుడు, అంబాలికకు పాండురాజు జన్మించారు. మహాభారత కథలో కృష్ణార్జునుల తరువాత మరి ఇద్దరు పాత్రలు ఈ ధృతరాష్ట్రుడు, పాండురాజు. కురుక్షేత్రంలో ధృతరాష్ట్రుని పుత్రులైన కౌరవులకు, పాండురాజు పుత్రులైన పాండవులకు

---

## పారిశ్రామిక అధినేతలలో బిర్లాదే ప్రథమ స్థానం

1983 సం. లో ఆస్తుల విషయంలో మొదటి 10 పారిశ్రామిక అధినేతలలో ప్రథమ స్థానం బిర్లాది. ఇతరులు: టాటా, మఫత్ లాల్, జె కె సింగానియా, థాపర్, ఎ.సి.సి., రియలన్స్ టెక్స్టైల్స్, సారాభాయి, లార్సన్ & టూబ్రో మరియు మోడీ. ఆమ్మకాలలో ప్రథమస్థానం టాటా వారిది.

---

"దాన భోగములచే ధనము వ్యయము చేయని పురుషుని యొక్క విత్తము నాశమగును."

రాజ్యాదుల మాత్సర్య ఫలితంగా సంభవించిన మహాభారత యుద్ధం మన అందరికీ తెలిసిందే.



మహాభారత యుద్ధం

ఈ కురుక్షేత్ర యుద్ధ ఫలితంగా ధృతరాష్ట్రుని కుమారులు, మనుమలు, మునిమనుమలుతో పాటు కౌరవ వంశం సర్వనాశనమయింది.

వేదవ్యాసుడు జీవించియున్నాడు. భారత యుద్ధం, సత్యసంధులైన పాండవుల కష్టాలు, వారి దిగ్విజయాలు, కౌరవ వంశనాశనం అన్నీ ప్రత్యక్షంగా కళ్ళారా చూచాడు. ఒక దివ్య సందేశాన్ని లోకానికి ప్రతిపాదించాలని నిర్ణయించుకున్నాడు. మహాభారత సంహితను రచించాడు. ఇది ఒక పురాణమే కాదు, చతుర్వేద సారాన్ని లోక సంగ్రహార్థం ఇందులో నిక్షేపించాడు.

అందుకే ఇది పంచమ వేదంగా పరిగణించబడుతూంది. రాజనీతి లౌకిక వ్యవహార నిర్వహణ పొందుపరచబడింది ధర్మ తత్త్వజ్ఞులకు ఇది ధర్మశాస్త్రం, ఆధ్యాత్మిక విదులకు ఇది వేదాంతం. నీతి విచక్షణులకు ఇది నీతి శాస్త్రం. ఐతిహాసికులకు ఇది ఇతిహాసం, పౌరాణికులకు ఇది పురాణం. పరమాస్తికుడు, భగవద్ధ్యానైక తత్పరుడు పరహితైషి అగు వేదవ్యాసుడు మహాభారతంలో పొందుపరచిన భగవద్గీత ఆధ్యాత్మిక కావ్యగానము. లోకంలో సత్యధర్మములను సంరక్షించుకోడానికి, జీవితతత్త్వాలను ప్రకాశింప జేసుకోడానికి భారతీయులకే కాదు ప్రపంచంలో యావన్మందికీ పరమ పూజనీయము, ప్రమాణము అగు గ్రంథము భగవద్గీత. వేదస్వరూపము, పరమానంద ప్రదము, తత్త్వజ్ఞాన బోధకము అగు గీతను శ్రీకృష్ణుడు స్వయంగా అర్జునునకు బోధించాడు



కృష్ణార్జునులు

## 2,500 సంవత్సరాల నాటి అస్థి అవశేషాలు

అమెరికా, ఈజిప్షియన్ దేశాలు జరిపిన అన్వేషణలో 2,500 సంవత్సరాలకు పూర్వం సహారా ఎడారిలో మాయమైపోయిన పర్షియా సైనికుల అస్థుల అవశేషాలతో అనేకవేల సమాధులు కూడా బయల్పడ్డాయి. ఈ అస్థులు అన్నీ రాతిపలకల మీద పరచబడి పర్షియా ఆచార ప్రకారం రాళ్ళతో పూడ్చబడ్డాయి.

"అపకీర్తికంటె ఘనమైన మరణం లేదు."

# కోరి ంటే?

క్రోరింత దగ్గు అనే జబ్బు సూక్ష్మ జీవులవల్ల సంభవిస్తుంది. ఇది సాధారణంగా పసిబిడ్డలకు, చిన్న పిల్లలకు వస్తూ ఉంటుంది. రోగం ప్రథమావస్థలో మిక్కిలి సులభంగా



ప్రసరించే అంటు రోగం. ఆంగ్లంలో దీన్ని వూపింగ్ కాఫ్ (whooping cough) అంటారు.

ముఖ్య లక్షణాలు:

స్పర్శవల్ల రోగం సంక్రమించి వారం రోజులు లేక వారం రోజుల తరువాత ఈ క్రింద ఉదహరించిన లక్షణాలు కనిపిస్తాయి.

1 వ వారం:

బిడ్డకు బాగా జలుబు, దగ్గు కలిగి ముక్కు వెంట కారుతూ ఉంటుంది.

2 వ వారం:

దగ్గు విపరీతంగా వస్తుంది.

దగ్గడానికి కష్టపడతారు.

దగ్గు ఆగకుండా వస్తుంది.

రోగి భయపడతాడు. కళ్ళు ఉబ్బుతాయి.

అతి కష్టంమీద ఊపిరి తీసుకోగలుగుతాడు.

ఊపిరి 'వూప్' అని శబ్దంతో తీసుకుంటాడు.

రోజస్తమానం పగలు రాత్రికూడా ఒకే దగ్గు. వాంతి.

తీవ్రమైన దగ్గువల్ల కళ్ళలోను, కనురెప్పలలోను రక్తం కారుతుంది.

3 వ వారం అటుపైన:

దగ్గు క్రమంగా తగ్గుతుంది.

కోరింత దగ్గువల్ల ఊపిరితిత్తులు, మెదడు దెబ్బతింటాయి.

బిడ్డ నీరసించి, క్షీణించి పోతాడు.

నిరోధక చర్య:

పిల్లలందరికీ ఈ రోగం రాకుండా మందు, ఇంజక్షనులు ఇవ్వాలి. శరీరంలో అవసరమైనంతగా వ్యాధి నిరోధక అంటీబాడీలు(anti bodies) ప్రవృద్ధి పొందడానికి DPT మూడు ప్రత్యేక మోతాదులలో అవసర ముంటుంది. ఈ మోతాదులు ముఖ్యంగా బిడ్డ మొదటి సంవత్సరంలో 3 నెలల తరు

(మిగతా 45 వ పేజీలో)

"సంగమం వలన కామం, కామం వలన క్రోధం, క్రోధం వలన సమ్మోహం, సమ్మోహం వలన స్మృతి తప్పుట కలుగును." —గీత

# యోచనాశక్తి పెంపొందాలంటే

సూటిగా సక్రమంగా ఆలోచన చేయడానికి, మీ ఆలోచనా శక్తిని అభివృద్ధిపరచు కునేందుకు 15 సూచనలు:



1. మీ అంతట మీరు స్వంతంగా ఆలోచించాలి: మీరు చూచేదాన్ని, వినే దాన్ని, చదివేదాన్ని మూడింటిని విడి విడిగా పూర్తిగా ముందు వెనుకలు విశ్లేషణం చేసు కోక పోవడం అవివేకానికి దారి తీస్తుంది. అలా కాకుండా అన్ని అంశాలను విశదంగా ఆలోచించి, విమర్శించి, పరిశీలిస్తే అసలు యదార్థం తెలుసుకోగలుగుతారు. నలుగురికి చెప్పడానికి వీలు కలుగుతుంది. వివేకం మిక్కిలి ఆవశ్యకమైనది.

2. ఏ కార్యమైనా చేసే ముందు విస్పష్టంగా ఆలోచించాలి: అనవసరంగా కంగారుపడిపోయి అప్పటి కప్పుడు మిక్కిలి ఉద్వేగంతో చేసే పనులు అన్నీ బుద్ధికి ఎలా తోస్తే అలా చేసినవే. రెండు నిమిషాల పాటు తత్తరపాటు లేకుండా మంచి చెడ్డలు ఆలోచించి, చేయవలసిన పనులు వివేకంతో ముగించుకుంటే ఎంతో ఫలితం ఉంటుంది.

3. వంచన లేకుండా నిష్పక్షపాతంగా ఆలోచించు: సంకుచితమైన స్వలాభాపేక్ష లేకుండా ఆలోచించే శక్తిని ప్రవృద్ధి చేసుకోవాలి. చెవిలో పడిన దానిని మాత్రం వినేసి ఊరుకోవడం, అసలు ముఖ్య విషయాలకు భయపడి వ్యంగ్యార్థాలు, అపార్థాలు చేసుకుంటూ యథార్థం తప్పించుకుపోవడానికి ప్రయత్నం చేయడం మానుకుంటే నగ్నసత్యం తెలిసి వస్తుంది.

---

## లభ్యమయ్యే మంచి నీటిలో 70 శాతం కాలుష్యం

ప్రస్తుతం భారతదేశంలో లభ్యమయ్యే మంచి నీటిలో 70 శాతం కాలుష్యమైనదే. ఈ నీటికి సంబంధించిన రోగాల వల్ల 780 లక్షల పని రోజులు వ్యర్థ మవుతున్నాయని అంచనా వేయబడింది. రోగ నివారణకు అయే ఖర్చు, ఉత్పత్తిలో నష్టం మొత్తం పాలీనా రూ. 600/- కోట్లు.

"శరీరానికి శుద్ధి నీరు, మనస్సుకి శుద్ధి విజ్ఞానం,
బుద్ధికి శుద్ధి సత్యం, ఆత్మకు శుద్ధి అహింస." —బోధాయన

**4. ముందు ఆలోచన ఉండాలి:** వర్తమానంలో విహరించడం మాని సూక్ష్మ బుద్ధితో ఇక మీదట రాబోయే కాలంలో పర్యవసానం ఆలోచించుకోడం అలవాటు చేసుకోవాలి. ముందు ఆలోచన ఎంతో ముఖ్యం మనం ఆలోచిస్తున్నదాని ఫలితార్థం ఏమిటి? ఇది ఎలా పరిణమిస్తుంది? ఏం జరగబోతుంది? అవి బాగా వితర్కించుకుని కార్యక్రమంలోకి దిగాలి. ఒక కార్యం చేయదలచుకొన్నప్పుడు మొదట దాని కెట్టి పర్యవసానం కలుగుతుంది అని ఆలోచించి ఉద్యమించాలి

**5 సంపూర్ణ విశ్వాస భావంతో ఆలోచించు:** నిరాశ చెంది భయపడి పోకూడదు. ఆశాభావం అలవరచుకోవాలి. విశ్వాసవంతుడైనవాడు ఎటువంటి కష్ట పరిస్థితుల్లోనైనా చిక్కిన సదవకాశాన్ని వినియోగించుకో గలుగుతాడు. ఎంతటి క్లిష్టమైన పరిస్థితుల్లోనైనా సరే నిర్భరంగా ఆశాభావాన్ని అభివృద్ధి చెసుకోడానికి ప్రయత్నించాలి.

**6 శాంతంగా ఆలోచించు:** తొందరపడిపోవద్దు సావకాశంగా, వివేక బుద్ధితో విచక్షణ చేసుకుంటే సత్యం తేటగా తెలుస్తుంది. నిజం నిలకడమీదే తెలుస్తుంది.

**7 పరోపకార బుద్ధితో ఆలోచించు:** ఇతరులమీద ప్రేమాభిమానాలు పెంచుకుంటే విశాల హృదయంతో తిలకించటానికి అవకాశం కలుగుతుంది. ఓర్వలేని తనం, లోభం, అసూయ, క్రోధ భావాలతో ఆలోచనలు ప్రారంభిస్తే పాపభీతి వెంటాడుతుంది. ఇటువంటి వారిలో పశుత్వమే తప్ప మానవత్వం శూన్యం! న్యాయమార్గం విడవకుండా ఉండడమే పరమార్థం!

**8 ఒక్కసారే కాదు రెండు సార్లు, మూడుసార్లు ఆలోచించు:** తేట మనస్సుతో తూకం వేయాలి. ఒక నిశ్చయానికి రాబోయే ముందు దానికి సంబంధించిన విషయాల నన్నిటిని మదింపు చేసుకోవాలి.

**9. దురాభిమానం పనికి రాదు:** ఒక పరిష్కారం తీర్పుకు వచ్చేముందు దానికి

---

## పురుషులకే ముసుగు



ఉత్తర ఆఫ్రికా సహారా ఎడారులలో ట్యూరెగ్స్ (tuaregs) నివసిస్తారు. వీరిలో ముసుగు ధరించడానికి పురుషులకే అనుమతి ఉంది. ముసుగు ధరించి ఎడమ చేతికి కత్తి కట్టుకుంటే పురుషుడికి వయస్సు వచ్చింది అని అర్థం!

"సంతృప్తి, ఆనందం సౌందర్య వర్ధకాలు -
ఆరోగ్య సంరక్షకాలు."

— చార్లెస్ డికెన్స్

సంబంధించిన అన్ని విషయాలను, అంతా లను తెలుసుకోడానికి ప్రయత్నించు.

10 నీ లోటు పాట్లను తెలుసుకుని నిష్కపటంగా ఆలోచించు: నీ తప్పులు ఎంతవైనా లెక్క చేయకుండా ఇతరుల తప్పులను గోరంతలు కొండంతలు చేయడంవల్ల కపటం, మోసం, వంచన, అధికమై చిట్టానికి తావుండదు. సమాజంలో నీతి, ధర్మం చెడిపోతుంది.

11. ఆడినమాట నిలబెట్టుకో: ఆడిన మాట తప్పకుండా చేయవలసిన పనులు సక్రమంగా నెరవేరుస్తే మీ ఆలోచనలు స్వచ్ఛంగా, నిర్మలంగా ఉంటాయి.

12 విస్పష్టంగా విశదంగా ఉండే విషయాలను వదలకు: ఎంతెంత పెద్ద సమస్యలకైనా పరిష్కార మార్గాలు ఎదురుగానే కన్పిస్తుంటాయి. సదవకాశాలను వినియోగించుకోవాలి.

13 కృత నిశ్చయంతో ఆలోచించు: యోగ్యమైన భావాలను పరిగ్రహించడం వల్ల ఎంతో లాభకరంగా ఉంటుంది.

14 వివరాలను పరీక్షించు: నీవు తలపెట్టిన ప్రతీ పనికి అన్ని వివరాలను పూర్తిగా అవగాహన చేసుకోకపోతే చిక్కులలో తగులుకుంటాము.

15 లోతుగా పరీక్షించు: పైపై విషయాలు తెలుసుకుంటే చాలదు. విన్నదానిని, చదివిన దానిని మరల మరల ఆలోచించి పనులను చేపట్టాలి. ఇతరులు నీకు ఏమి చేయాలని నీవు అనుకుంటావో అదే నీవు ఇతరులకు చేయడానికి ప్రయత్నించు. అదే ప్రపంచంలో ప్రగతిపూర్వకమైన శాంతికి మార్గం. మంచి ఆలోచనకు పునాది. ఆతురతతో, ముందు వెనుక చూడక చేసే పనులవల్ల మరణ పర్యంతం మనస్సు దహించుకుపోతుంది.

('క్రిస్టఫర్' సౌజన్యంతో)

---

## చారుని సంపాదనతో రాజ మర్యాదతో జీవించిన రాజు



దేశభ్రష్టుడైన ఫ్రాన్స్ చక్రవర్తి కింగ్ లూయి XVIII, 23 సంవత్సరాలపాటు రాజ మర్యాదలతో కౌంట్ ది బ్లాకాస్‌తో అతడికి పాలీనా మట్టే 40,000 డాలర్లు పంచుకుని దాంతో జీవించాడు ఈ మొత్తం చక్రవర్తిపై గూఢచారిగా వున్నందుకు నెపోలియన్ చారునికి ఇచ్చినది. తరువాత లూయి XVIII చారుని విశ్వాసానికి మెచ్చుకుని అతనినే డ్యూకుగా నియమించాడు.

"చేసిన తప్పులను సమర్థించుకోవడానికి ప్రయత్నించకు, మంచిని పెంచుకుంటే తప్పులు తొలగిపోతాయి." —స్వామి వివేకానంద

# తిమింగిలం

ఎస్. శ్రీనివాస రంగన్

## 2

ఈ తిమింగిలాలు అప్పుడప్పుడు కవల పిల్లలను పెట్టినా సాధారణంగా ఒక్కొక్కసారి ఒక్క పిల్ల తిమింగిలాన్నే కంటాయి. మింకీ (Minke) జాతి తిమింగిలం ప్రతీ ఏటా పిల్లలను ఈనుతుంది. కాని బలీన్ జాతి తిమింగిలాలు రెండేసి సంవత్సరాల



SPERM WHALE

స్పెర్మ్ జాతి తిమింగిలం

కొక్కొక్కసారే పిల్లలను ఈనతాయి. నీలి (Blue) తిమింగిలం పుట్టుకతోనే సుమారు 23 అడుగుల పొడవుగా ఉంటుంది. తల్లి తిమింగిలంలో నాలుగోవంతు పొడవుగా ఉంటుంది. నీలిజాతి తిమింగిలం తన పిల్లకు ఏడు నెలలదాకా ప్రతీరోజూ ఒక టన్నుపాలు పుష్కలంగా కుడిపిస్తుంది. పెద్దదై పాలు త్రాగడం మానేసేనాటికి ఇది 50 అడుగుల పొడవుదాకా పెరుగుతుంది. రెండవ ఏడు వచ్చేసరికి పొడవు 75 అడుగుల దాకా ఉంటుంది.

నీలి తిమింగిలం, అంటార్కిటిక్‌లో నివసించే ఫిన్ (Fin) జాతి తిమింగిలాలు 4 లేక 5 సంవత్సరాల నాటికే గర్భం ధరించడానికి సిద్ధంగా ఉంటాయి. వీటి గర్భధారణ కాలం 6 మొదలు 12 నెలలు, దానికి పైబడి ఉంటుంది. స్పెర్మ్ జాతి మగ తిమింగిలం అనేక ఆడ తిమింగిలాలతో సంబంధం కలిగి ఉంటుంది. వేసవికాలంలో ముసలి స్పెర్మ్ తిమింగిలాలు ఆర్కిటిక్, అంటార్కిటిక్ సముద్రాలలో నివసిస్తూ ఉంటే. యువ స్పెర్మ్ తిమింగిలాల జంటలు ఉష్ణప్రదేశపు

## గ్రామీణ ప్రాంతాలలో సిగరెట్లు త్రాగడం పెరిగింది

భారతదేశంలో అమ్మబడే ప్రతీ ఒక సిగరెట్టుకి సుమారు ఏడు బీడీలు అమ్మబడేవి. కాని ఇటీవల బీడీల కంటె సిగరెట్లునే ఎక్కువగా కాలుస్తున్నట్టు తేలింది. బీడీల వాడకం 2 శాతం తగ్గింది.

"జీవితం యొక్క ముఖ్యాశయం ఆనందం అని అనుకోనంతవరకూ మానవుడు సౌఖ్యంగానే ఉండగలడు." —జార్జ్ ఆర్వెల్

సముద్రపు నీటిలో విహరిస్తూ ఉంటాయి. వీటి గర్భధారణ కాలం సాధారణంగా 15 మొదలు 16 నెలలు. ఒక్కొక్క మగ తిమింగిలం 20 లేక 30 ఆడ తిమింగిలాల మీద అధికారం చెలాయిస్తూ ఉంటుంది.




కిల్లర్ జాతి తిమింగిలం

తిమింగిల జాతులలో హైపిరూడాన్ (Hyperoodan) జాతి-సీసాముక్కుగల-తిమింగిలాలు ఎక్కువగా బాధ్యత కలిగినవి. పిల్ల తిమింగిలాల మీద మిక్కిలి శ్రద్ధను వహిస్తాయి. గుంపులు గుంపులుగా చేరి నివసిస్తాయి. గాయపడి రోగంతో బాధపడే తిమింగిలాన్ని చాలా జాగ్రత్తగా చూసు కుంటాయి. ఇవి పెద్ద పెద్ద ఓడలను డాల్ఫిన్స్‌లా వెంటాడుతుంటాయి. ఎప్పుడైనా పిల్లతిమింగిలం ఓడ దరిదాపులకు వెడుతూ ఉంటే దానికి అపాయం కలుగకుండా రక్షించడానికి ప్రయత్నిస్తుంది.

వీలి తిమింగిలాలు 50 సంవత్సరాలపాటు జీవిస్తాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కిల్లర్ తిమింగిలాలు దాదాపు 80 సంవత్సరాల దాకా జీవిస్తాయి. నీటిలో చేరే కాలుష్యాలవల్ల తిమింగిలాలకు అపాయం కలుగుతూంటుంది. ఆహార మరియు వ్యవసాయ సంస్థవారి రిపోర్టు ప్రకారం ఆర్గానో క్లోరైడులు, పోలీక్లోరినేటెడ్ హైడ్రోకార్బనులు, ఇతర లోహ సంబంధమైన విషపదార్థాలు నీటి పొరలలో చేరి ఉంటాయి అవి తేలింది బలీన్ జాతి తిమింగిలాలనుంచి లభ్యమయ్యే నూనెలో పోలీ క్లోరినేటెడ్ హైడ్రొకార్బనులు అధికంగా ఉంటే స్పెర్మ్ జాతి తిమింగిలాల మాంసంలో పాదరసం ఎక్కువగా ఉంటుంది.

తిమింగిలాలలో బలీన్ జాతి తిమింగిలాలు మిక్కిలి పెద్దవి. వీటి నోటిలో పళ్లు ఉండవు. వంచడానికి వీలుగా ఉండే గట్టి పదపోత సాధనాలు 'బలీన్' (Baleen) లు పై దౌడలో రెండుప్రక్కల ఏర్పాటై ఉంటాయి. సముద్రంలో సంచరించే క్రిల్ (Krill) మరియు ఇతర చిన్న చిన్న జంతువులే వీటికి ఆహారం. ఈ తిమింగిలాలునోరు తెరుచుకుని నీటిలో మెల్లిగా ఈదుకుంటూ వెళ్ళేటప్పుడు ఎన్నెన్నో గాలనుల నీరు నీటి

## స్లేవియా 10,000 వోల్టు కరెంటును తట్టుకోగలడు

యుగోస్లావియా(యూరప్)నోవీసాతౌలో నివసించే స్లేవియా పాజ్‌కిక్ అనే వ్యక్తి ఎలక్ట్రిక్ కుర్చీలో నిక్షేపంలాకూర్చుని దానిగుండా ప్రవహించే విద్యుత్తును భరించ గల నంటున్నాడు ఇతడు 10,000 వోల్టుల విద్యుచ్ఛక్తిని తట్టుకోగలడు.

"....మూర్ఖజన చిత్తము దెల్ప నసాధ్యమేరికిన్."

నోటిలో ప్రవేశించి దౌడల ప్రక్కలనుంచి కారిపోతూ ఉంటే క్రిల్ మొదలైన ఆహారం వలలవంటి బలీనులలో చిక్కుకుంటాయి. ఎప్పటికప్పుడు నాలుకతో ఈ బలీన్‌ను శుభ్రం చేస్తూ, ఆహారాన్ని గొంతుకలోకి జార్చు కుంటుంది.



RIGHT WHALE

రైట్ తిమింగిలం

బలీన్ జాతి తిమింగిలంలో నీలి (Blue) తిమింగిలం మిక్కిలి పెద్దది. ఇది సుమారు 100 అడుగుల పొడవు గలిగి 200 టన్నుల భారం ఉంటుంది. సాధారణంగా ఆడ నీలి తిమింగిలం మగదానికంటె ఎన్నోరెట్లు పెద్దదిగా ఉంటుంది.

ఈ బలీన్ జాతి తిమింగిలాలలో చేరినదే రైట్ తిమింగలం. ఇది అమూల్యమైనది. వీటినుంచి లభ్యమయ్యే నూనేగాక వీటి యొక్క ఎముక కూడా ఎక్కువగా ఉపయోగ పడుతుంది. రైట్ తిమింగిలం మరణించి నప్పుడు ఇది నీటిలో తేలుతుంది. బలీన్ జాతికి చెందిన బౌహెడ్ (bowhead) తిమింగిలం రైట్ తిమింగిలంకంటే పెద్దదిగా ఉంటుంది.

పండ్లుగల తిమింగిలాలు (Toothed-whales) ప్రత్యేకమైన తిమింగిల జాతికి చెందినవి. ఇవి మాంసాహారులు. పెద్ద



BOWHEAD WHALE

బౌహెడ్ తిమింగిలం

పెద్ద చేపలను, ఇతర జంతువులను తింటాయి. ఈ తిమింగిలాల నోటిలో పెద్ద పెద్ద మేకులవంటి దంతాలుంటాయి. ఈ

## భారత దేశంలోనే ప్లాస్టిక్ సర్జరీ ప్రారంభం

మన శరీరంలో నశించిపోయిన భాగాన్ని తిరిగి సరిచేసే ప్లాస్టిక్ సర్జరీ కళ మొట్ట మొదట భారతదేశంలోనే ప్రారంభమైందని ఢిల్లీలో ఆల్ ఇండియా ఇన్స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌కు చెందిన డా. జె. ఎన్. శర్మ అంటున్నారు. బ్రిటిష్ వారు ఇండియాకు వలస వచ్చినప్పుడు వారు సంస్కృతం అభ్యసించి శస్త్ర చికిత్సను గూర్చి వివరించే శుశ్రుత సంహితను విమ ర్శించి భారతీయ వైద్యులవద్ద ప్లాస్టిక్ సర్జ రీలో అనుభవ జ్ఞానాన్ని అభివృద్ధి చేసు కున్నారు.

"....రోగశాంతి కర కృత్యము భోగమనంగ జెల్లునే."

జాతిలో విస్తారంగా కనిపించేవి స్పెర్మ్ తిమింగిలం. ఇది సుమారు 65 అడుగుల పొడవు కలిగి 60 టన్నుల బరువు ఉంటుంది. దీని తల మాత్రం శరీరంలో మూడవ వంతు ఉంటుంది. దీని తల ముందు భాగంలో పెద్ద



FALSE KILLER WHALE

ఫాల్స్‌కిల్లర్ తిమింగిలం

పెద్ద స్టోరేజి టాంకులలో స్పెర్మాసీటీ (Spermaceti) నూనెవంటి క్రొవ్వు పదార్థం నిలువ ఉంటుంది. దానివల్లే దీనికి స్పెర్మ్ తిమింగిలం అని పేరు కలిగింది. ఈ స్పెర్మా సీటీ అనే నూనెవంటి పదార్థం నీటికంటె కూడా చాలా తేలికగా ఉంటుంది. అందువల్లనే ఈ తిమింగిలం అతి వేగంగా నీటిలోకి మునిగి అంతకంటే వేగంగా పైకి రాగలుగుతుంది ఆహారం కోసం అరమైలు లోతుగా కూడా మునిగి ఒక్కొక్కప్పుడు 40 నిమిషాలదాకా కూడా లోపల ఉండి తరువాత పెకి వస్తుంది.

స్పెర్మ్ తిమింగిలాలు సువాసనల ద్రవ్యాలలో ఉపయోగించే అంబెర్‌గ్రీస్ (Ambergris) అనే పదార్థాన్ని ఉత్పాదిస్తాయి. ఉత్తమరకం అంబెర్‌గ్రీస్ చాలా విలువైంది, బంగారంతో సమానమైనది. సాధారణంగా స్పెర్మ్ తిమింగిలాలు స్క్విడ్స్ (squids) ను - పది చేతులుండే సముద్రపు జంతువు - కూడా మ్రింగేస్తాయి. జంతువు అంతా జీర్ణించిపోయినా నీటి చిలుకలముక్కు వంటి గట్టి ముక్కులు జీర్ణంకావు. ఇవి జీర్ణకోశంలోకి చేరవు. నీటి మీద క్రమంగా నల్లటి జిగురువంటి పదార్థం పేరుకుంటుంది. ఇది విపరీతమైన దుర్గంధంతో ఉంటుంది. ఇదే అంబెర్ గ్రీస్ గాలి తగిలినప్పుడు ఈ దుర్గంధం పోతుంది. స్పెర్మ్ తిమింగిలాలు ఈ పదార్థాన్ని నీటిలోకి వదులుతుంటాయి. ఇది నీటిలో తేలి గట్టుకు కొట్టుకువస్తుంది. స్పెర్మ్ తిమింగిలం బ్లబ్బర్ నుండి లభ్య

## మిలటరీ మీద వ్యయం

అమెరికా ఆర్మ్స్ కంట్రోల్ అండ్ డిస్ ఆర్మమెంట్ ఏజెన్సీవారు విడుదల చేసిన "ప్రపంచంలో మిలటరీ వ్యయం మరియు ఆయుధాల బదిలీ" అనే వార్షిక రిపోర్టు ప్రకారం 1972 సం. నుండి ప్రపంచంలో మిలటరీ ఖర్చులు బాగా పెరిగింది. 1985 వ సం. లో ఈ ఖర్చులు 1000 బిలియన్ డాలర్లకు పైగా ఉంటుంది. 1972 మరియు 1982 సంవత్సరాల మధ్య అభివృద్ధి పొందిన దేశాలలో ఆయుధాల మీది ఖర్చు సాలీనా 2.4 శాతం రేటు చొప్పున పెరిగింది. అభివృద్ధిని పొందుతూన్న మూడవ ప్రపంచంలో ఈ ఖర్చు 6 శాతం పెరిగింది.

"....సాధు సద్గుణలవంబులు కొందరు పేపి మెచ్చుచున్
మదిని విశాలయుక్తులగు మాన్యులు కొందరు వా ట్టురిద్దరిన్."

మయ్యే నూనె విశిష్టమైన ల్యూబ్రికేటింగ్ ఆయిల్‌గా ఉపయోగపడుతుంది.

పండ్లుగల తిమింగిలాలలో మరొకటి కిల్లర్ తిమింగిలం. దీనినే గ్రాంపస్ (grampus) అంటారు. ఇది చాలా భయంకరమైన తిమింగిలం. 20 లేక 30 అడుగుల




పైలట్ తిమింగిలం

పొడవు ఉంటుంది. పైలట్ తిమింగిలం మొదలైన ఇతర సముద్రపు జంతువులు దీనిని చూచి భయపడిపోతాయి. కిల్లర్ తిమింగిలాలు ఇతర పెద్ద పెద్ద తిమింగిలాలను కూడా ఎదిరిస్తాయి.

పైలట్ తిమింగిలాలు వందలకొద్దీ గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉంటాయి. ఇవి చిన్న చిన్న చేపలను, స్క్విడ్స్‌ను తింటాయి. కొన్ని సంవత్సరాల క్రితం వందలకొద్ది పైలట్ తిమింగిలాలు తమిళనాడులో తూత్తుకుడి సముద్రపు ఒడ్డుకు చేరుకున్నాయి. కెనడా న్యూఫౌండ్‌లాండ్, ఫారో దీవులలో వీటిని చిన్న చిన్న పల్లాలలోకి తోసి సులభంగా చంపి నూనెనూ, మాంసాన్నీ సంగ్రహిస్తారు.

అనేక రకాల తిమింగిలాలు అచిరకాలంలోనే అంతరించిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. గత వెయ్యి సంవత్సరాలనుండీ 'బ్లబ్బర్' కొవ్వు కోసం, నూనెకోసం, అతి క్రూరంగా వీటిని చంపుతున్నారు. ●

## అంతుపట్టలేని మానవ హృదయం

చేపలు నీటి లోతులలో నివసిస్తాయి. డేగలు ఆకాశంలో ఎత్తుగా విహరిస్తాయి. ఒకదాన్ని బాణంతో కొడితే, రెండవదాన్ని గాలంతో పట్టవచ్చు. కాని మానవునికి అతి సన్నిహితంగా ఉండే మానవ హృదయం అంతుపట్టలేం. —బర్మా సామెత

## అద్భుతమైన జైన దేవాలయం

తమిళనాడు ఉత్తర ఆర్కాటు జిల్లా తాచూర్ అనే గ్రామంలో 9 వ శతాబ్దం చోళుల కాలంలో నిర్మించబడిన దిగంబర జైన దేవాలయం మిక్కిలి అద్భుతమైనది. ఈ దేవాలయంలో ప్రతి సంవత్సరం ఫిబ్రవరి 25, 26, 27 తేదీలలో సూర్యకిరణాలు సరాసరి శ్రీ ఆదీశ్వరతీర్థంకర (ఋషభదేవ) విగ్రహం మీద తల నుండి పాదాల దాకా ప్రసరిస్తాయి.

“తమక్షేమప్రయోజనం గాని కలుగకయే పరుల కార్యములను

# లుకు

జగత్ ఎస్. బ్రైట్

## 6

**అపజయానికి భయపడకు:**

లక్షలులక్షలు కొల్లగొట్టుకు పోతూంటే పైసాలు లెక్క పెట్టడం, గుమ్మడికాయ పోయిందని తెలియక ఆవగింజకు పీకు లాడటం వంటిది. విశ్వాసందాన్ని కలిగించే ఆధ్యాత్మిక సౌభాగ్యాన్ని విస్మరించి క్షణికా లైన భౌతిక సుఖాలకు ఆరాటపడకూడదు. దబ్బుకోసం గడ్డికరచి అనర్థాలను కొని తెచ్చు కోకూడదు. ఒక పని చేయదలచుకుని ప్రారం భిస్తే అది మరో విధంగా పరిణమించడం సహజం. మనం దేవుని చేతిలో కీలుబొమ్మల వంటి వాళ్ళం. ఒక పని జరగలేదని, విజయం పొందలేదని భయపడిపోవడం ఎందుకు? ఒక చోట అపజయం కలిగితే మరోచోట దిగ్వి జయం కలుగుతుంది. ఫలితం వెంటనే తెలి యకపోయినా మెల్లిగా తెలిసివస్తుంది.

• • •

**అవసరమైన దానికన్నా ఆశించవద్దు:**

అవసరమైన దానికంటే అధికంగా ఆశిస్తే అశాంతి చోటు చేసుకుంటుంది.

• • •

**దేవుడు అవసరాలను తీరుస్తాడు కాని ఆశలను తీర్చడు:**

కనీస అవసరాలకు కష్టపడి పోనక్కర లేదు. భగవంతుడే జాగ్రత్తపడతాడు. తాను సృష్టించిన ప్రాణికోటికి జీవన విధానం కల్పించవలసిన బాధ్యత అతడిదే. ఆత్మాశకు పోకుండా ఉంటే బరువో భారమో అతడే చూసుకుంటాడు. అవసరాలు ఆశలు మితి మీరితే ఎవరికి వారే చూసుకోవాలి.

• •

**సర్వ సమస్యా పరిష్కారం:**

సమస్యలు సవాలక్ష. అన్నిటికీ పరిష్కా రాలు ఉన్నాయి. ఎక్కడో లేవు. వ్యక్తిలోనే ఉన్నాయి. ఒక వ్యక్తికి కల్గే సమస్యలన్నిటికీ పరిష్కారం ఆ వ్యక్తిలోనే ఉంటుంది. ఈ రహస్యం తెలుసుకోడమే ముక్తిమార్గం. ●

## రక్తాన్ని పీల్చే గబ్బిలాలు

మధ్య అమెరికా మెక్సికోలో రక్తాన్ని పీల్చే వాంపైర్ గబ్బిలాలు ప్రతీ రోజూ రాత్రిపూట పొలాల్లో మేకలు, ఆవులు, గుర్రాలు మొదలైన జంతువుల రక్తాన్ని పీల్చే స్తాయి. ఒక్కొక్కప్పుడు నిద్ర పోతూన్న మానవుల శరీరంలో నుంచి కూడా రక్తాన్ని పీలుస్తాయి. మెలకువ వచ్చినప్పుడు వెనుకకు పోయి, తిరిగి పడుకున్నప్పుడు రక్తాన్ని పీల్చడం ప్రారంభిస్తాయి. జలగల్లాగా పొట్ట ఉబ్బే దాకా రక్తాన్ని పీల్చి ఎగరలేక క్రింద పడతాయి.

---

[illegible] లేదు."

# కలంస్నేహితులు

[మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.]

1. బి. సిద్దయ్య, 22 సం.లు, బి.ఏ. ద్వితీయ సంవత్సరం విద్యార్థి మరియు జూనియర్ డిప్లొమా, s/o బాలకిష్టయ్య, తాడ్కపల్లి, సిద్ధిపేట తాలూకా, మెదక్ జిల్లా, 502 106

కలం స్నేహం, ప్రకృతి ఆరాధన, నవలా పుస్తక పఠనం.

2. జె. భానుప్రకాష్, 23 సం.లు, బి.కామ్, s/o జక్కు నారాయణ, ఇం. నెం. 10-44, ధర్మపురి పోస్టు, (కరీంనగర్ జిల్లా) 505 425.

ప్రకృతి ఆరాధన, పాటలు పాడటం, సూక్తుల సేకరణ.

3. ఎమ్.ఏ కరీమ్, 24 సం.లు, బి.ఏ. ఎల్.ఏ ఇ, ఇం.నెం. 5-5-101, వివేకానంద కాలనీ, కామారెడ్డి పోస్టు, (నిజామాబాద్ జిల్లా), 503 111.

కవిత్వం, మూఢ మత నమ్మకాలను త్రోసిపుచ్చడం, స్నేహం.

4. ఏ. వెంకటాచారి, 22 సం.లు, బి.కామ్, రెండవ సంవత్సరం విద్యార్థి, క్రాంతి ఆయిల్ మిల్, పందిల్ల పోస్టు, హుస్నాబాద్ తాలుకా, (కరీంనగర్ జిల్లా) 505 467

ఉత్తమ నవలా పఠనం, ప్రకృతి ఆరాధన, పాటలు పాడటం.

5. వై. నరసింహులు, 21 సం.లు, బి.ఏ. s/o బాలకిష్టయ్య, ఇం.నెం. 12-14, పెద్దమఠం దగ్గిర, జోగిపేట, (మెదక్ జిల్లా) 502 270.

సద్గ్రంథ పఠనం, జాతీయ నాయకుల అవగాహన, విస్‌డమ్ పఠనం.

## మిక్కిలి జ్ఞాన సంపన్నమైన 10 జంతువులలో వరాహం ఒకటి

అమెరికా హార్వర్డ్ యూనివర్సిటీలో పులిట్ జర్ బహుమాన గ్రహీత, జంతు శాస్త్రంలో ఆచార్య పదవిని అధిష్ఠించిన ఎడ్వర్డ్ విల్సన్ ప్రత్యక్షంగా పరిశోధనలు సలిపి ప్రపంచంలో మిక్కిలి జ్ఞానవంతమైన 10 జంతువుల జాబితాలో వరాహావతారాన్ని కూడా చేర్చారు. వీరి ప్రకారం జ్ఞానం అంటే వేగం మరియు వివిధ కార్యక్రమాల విస్తృత అధ్యయనం.

"....దివ పూర్వ పరభాగ జనితమైన

# మన రాష్ట్రాలు

## బికనీర్

ఒకప్పుడు సరస్వతీ నదీజలాలతో పునీతమై మహోజ్వలమైన నాగరికతతో వికసించిన భారతదేశపు బికనీర్ ఈనాడు థార్ ఎడారి. ఇసుక మైదానాల మధ్య ఉంది. గుప్త



బికనీర్ కోట

సామ్రాజ్యం పతనమైన తరువాత వరుసగా ఘూర్జర ప్రతిహారులు, చౌహానులు, భాటీ రాజపుత్రులు, రాథోరులు ఈ ప్రదేశాన్ని ఆక్రమించారు

రాథోర్ వంశీయుడైన రాజపుత్ర వీరుడు జోధ్‌పూర్‌కు చెందిన రావు జోధాజీ ఆరవ కుమారుడు రావు బిక్కాజీ 1465 వ సం లో బికనీర్ సంస్థానాన్ని స్థాపించాడు. 1488 వ సం. లో ఈతడే బికనీర్ నగరానికి పునాదులు వేయించాడు.

రాజస్థాన్‌లో నాల్గవ పెద్దనగరం బికనీర్. దీని చుట్టూ 7 కి.మీ. గొప్ప రాతి ప్రాకారం గలదు. శత్రుభయం లేకుండా రక్షణ కలిగించాలని 5 ద్వారాలతో ఈ గొప్పరాతి ప్రాకారం మహారాజా గాజ్‌సింగ్ (1746-87) నిర్మించాడు.

మహాద్భుతమైన కోటతోబాటు రకరకాల రాళ్ళతో నిర్మింపబడ్డ అనేక రమణీయమైన భవనాలతో ఈ నగరం అందచందాలను దిద్దుకుంది. సుప్రసిద్ధ మొగలాయి చక్రవర్తి అక్బరు సేనానాయకుడైన రాజారాయ్ సింగ్

---

## హిమాలయ శిఖరాలు ఇంకా పెరుగుతున్నాయి

భారతదేశం ఉత్తర ముఖంగా సుమారు 70 మరియు 250 లక్షల సంవత్సరాలకు పూర్వం హిమాలయ పర్వత శిఖరాలు ఏర్పడ్డాయి. భూగర్భంలో జనించే బ్రహ్మాండమైన ఒత్తిడి శక్తి తోపుడు ప్రభావంవల్ల హిమాలయ శిఖరాలు ఇంకా పెరుగుతున్నాయి.

(1571-1611) ఈ అజేయమైన బికనీర్ కోటను (1588-1593) లో స్థాపించాడు. తరువాత మరి 300 సంవత్సరాలలో అనేక ఇతర రాజులు, చక్రవర్తులు ఇతోధికంగా నగరాభివృద్ధికి తోడ్పడ్డారు.



ఎడారిలో ఒంటెలు

ఈ కోట చుట్టుకొలత 986 మీటర్లు. దీనిలో 37 బురుజు లున్నాయి. చుట్టూ ప్రాకారాన్ని ఆనుకుని 9 మీటర్ల వెడల్పుగల కందకం అతి గంభీరంగా ఉంటుంది.

ఔరంగజేబు దాడులను అతి ధైర్య సాహసాలతో ఎదుర్కొన్న తన తండ్రి స్మారక చిహ్నంగా ఆయన పేరున మహారాజా అనుప్‌సింగ్ 1609 వ సం.లో కరన్‌మహల్ దర్బార్ హాల్‌ను కట్టించాడు.

ఈ మహల్‌లో పైకప్పు చుట్టు గోడలు 17, 18 శతాబ్దపు సాంప్రదాయక శిల్పాలతో, చిత్రాలతో, కళా విన్యాసాలతో అత్యంత రమణీయంగా ఉంటాయి. ఈ పెద్ద కోటలో చంద్రమహల్, ఫూల్‌మహల్, శేష్‌మహల్, చాటర్‌మహల్ మొదలైన అనేక భవనాలు దేనికదే ఒక ప్రత్యేక కళాపై భవంతో కళకళలాడుతూ ఉంటుంది. చంద్రమహల్‌లో గోడలు అద్భుతమైన చలువరాతి బొమ్మలతో, అద్దాలతో అలంకరించబడి ఉంటాయి ఫూల్ మహల్‌లో అమర్చిన అద్దాలు, రాతి శిల్పాలు, వర్ణ చిత్రాలు హృదయరంజకంగా ఉంటాయి. శేష్‌మహల్‌లో ప్లాస్టర్ బొమ్మలు ఇచ్చటి ప్రత్యేక ఆకర్షణ. చాటర్ మహల్‌లో 'రాసలీల' శిల్పాల శిల్పకళా నైపుణ్యానికి నిదర్శనాలు. అనేక చిత్రాలతో, కళాఖండాలతో అలంకరింపబడిన గంగానివాస్ అతివిస్తారమైన దర్బార్‌హాల్.

నగరానికి పొలిమేరలలో ఎర్రరాతితో నిర్మించబడిన లాల్‌ఘర్ రాజభవనంలో అపురూపమైన చిత్రపటాలు భద్రపరచబడ్డాయి. దీనికి ఈశాన్యంగా 3 కిలో మీటర్ల దూరంలో ఒక పెద్ద చెరువుగట్టుపైన గజనీర్ రాజభవనం నిర్మింపబడింది. ఈ చెరువుగట్టు ముఖ్యంగా మహారాజు పక్షులను వేటాడే ప్రదేశం.

## భారతీయ మహిళలకు 5,000 టన్నుల బంగారం!

భారత ప్రభుత్వానికి ఏ కొద్దిగానో 100 టన్నుల బంగారం విలవ ఉంటే భారతీయ మహిళలకు 5,000 టన్నుల బంగారం ఉన్నట్టు, అదేవిధంగా ప్రభుత్వానికి 870 లక్షల టొన్నుల వెండి ఉంటే వీరికి 10,000 లక్షల టొన్నుల వెండి ఉన్నట్టు జెమ్ అండ్ జ్యూవలరీ ఎక్స్‌పోర్టు ప్రమోషన్ కౌన్సిల్ ఈ మధ్య జరిపిన పర్యవేక్షణవల్ల తేలింది.

బికనీర్‌లో జైన దేవాలయాలు, మఠాలు అనేకం ఉన్నాయి. 16 వ శతాబ్దంలో పరాశ్‌నాథ్ జ్ఞాపకార్థం భాండ్‌సార్ దేవాలయం అస్వాల్‌భండ్‌చే నిర్మింపబడింది. ఈ దేవాలయంలో ఎత్తైన ధ్వజస్తంభం బంగారు పూత పూయబడింది. నేమినాథ్ దేవాలయం ఇచ్చటి మరియొక అపూర్వ జైన ఆలయం.

బికనీర్‌కు 24 కి.మీ. దూరంలో దేష్‌నోక్‌లో కర్ణిజీ దేవాలయం మహారాజా సూర్‌సింగ్ నిర్మించాడు. కర్ణిజీ దేవమాతగా పరిగణింపబడింది. ఈ దేవాలయానికి చలువ రాతి శిల్పాలతో కూడిన పెద్ద ద్వారం ఉంది. ఈ రెండు అంతస్తుల దేవాలయంలో బంగారు గొడుగు మిక్కిలి అమూల్యమైనది.

ఈ నగరానికి తూర్పు దిశగా 8 కి.మీ దూరంలో దేవికుండ్ అనే ప్రదేశంలో బికనీర్ ప్రభువుల సమాధులు ఉన్నాయి. ఈ సమాధులను ఛాత్రీలు అంటారు. వీటిలో 'రాజా కిరణ్ సింగ్'. 'మహారాజా అనుప్‌సింగ్' ఛాత్రీలు అత్యంత ప్రాముఖ్యమైనవి. ఇవి 16 స్తంభాలతో నిర్మించబడిన పెద్ద పెద్ద సమాధులు. అనుప్‌సింగ్ ఛాత్రీ పైకప్పుమీద తమాల వృక్షవనంలో గోపికలతో శ్రీకృష్ణుని నాట్య భంగిమలు అతి సొగసుగా చిత్రింపబడ్డాయి.

ఇచ్చటి గంగా గోల్డెన్ జూబిలీ మ్యూజియంలో అపూర్వ కళాఖండాలు. శిల్పాలు భద్రపరచ బడ్డాయి. గుప్తుల కాలపు శిల్ప సౌందర్యం, కళా విన్యాసం ఇచ్చట చూడదగినది వీటిని 1917 వ సం.లో డా. ఎల్. పి. టెస్సిటోరీ బికనీర్ ప్రాంతంలో సంగ్రహించాడు. ఇచ్చట జీవకళలు ఉట్టిపడే 1.5 మీటర్ల ఎత్తైన చలువరాతి సరస్వతి విగ్రహం బికనీర్ కళాకారుల శిల్ప నైపుణ్యాన్ని ప్రకటిస్తుంది రాజారాయిసింగ్‌కు జహంగీరు బహూకరించిన పట్టువస్త్రాలు అమూల్యమైనవి. ఇవి ప్రాచ్యదేశపు హస్తకళా నైపుణ్యాన్ని, చిత్రకళాభిరుచిని చాటుతున్నాయి. ●

---

## అనేక జాతుల పశు పక్షులు అంతరించి పోతున్నాయి



మానవుడు భూమి మీద అవతరించి సుమారు 120 జాతుల జంతువులను, 150 రకాల పక్షులను పూర్తిగా అంతరింపజేశాడు. వచ్చే కొన్ని సంవత్సరాలలో 30 రకాల క్షీరదాలు, 320 రకాల పక్షులు, 180 రకాల సరీసృపాలు, 90 రకాల చేపలు అంతరించి పోవడానికి అవకాశం కనిపిస్తుందని, దీనికి పశు పక్షుల సహజ ఆవాసాలను నశింపచేయడం, అనేక కాలుష్యాలు ఏర్పడడం, అవివేకమైన వేట, వ్యాపార లాభాలకు నిర్దాక్షిణ్యంగా చంపడం ముఖ్య కారణాలని ఇటలీ దేశపు సహజ వాతావరణ పరిశోధకుడు రోగర్ పెట్టిమో చెబుతున్నాడు.

# క్రొత్తరుచులు

రాఘవేంద్రరావు

అది 1800 వ సంవత్సరం. నెపోలియన్ అప్పుడే ఇటలీ పీడ్‌మౌంట్‌లో మారెంగో యుద్ధంలో దిగ్విజయం పొందాడు. సావ



మార్కోపోలో మరియు చక్రవర్తి

కాశంగా ఏదైనా తిందామని ఆరాట పడుతున్నాడు. సైన్యానికి సంబంధించిన తినుబండారాల బండి ఇంకా రాలేదు. కొంతమంది సైనికులు ఆహారంకోసం బయలుదేరి వెళ్ళారు

కొన్ని కోడిగ్రుడ్లు, టొమాటోలు, చేపలు మాత్రం వారికి లభించాయి. వీటితోపాటు కొద్దిగా వెల్లుల్లిపాయలు చేర్చి మూనెలో వండి రొట్టెలో కలిపి తిన్నారు. ఇదే చికెన్ మారెంగో (chicken marengo). నేటికీ ప్రపంచంలో దీనిని ఇలాగే వండుకుంటారు. మనం తయారుచేసుకుని తినే వంటకాలు ఒక్కొక్క దాని వెనుక ఒక్కొక్క కథ ఉంది.

ఐస్‌క్రీం వాస్తవంగా 600 సంవత్సరాలకు పూర్వం చైనాలో ప్రారంభమైన విషయం మనలో చాలామందికి తెలియదు. మొదట మార్కోపోలో దీనిని తయారుచేసే విధానం యూరప్‌లో ప్రవేశపెట్టాడు. ఇటలీదేశస్థుడైన మార్కోపోలో చైనాలో కుబ్లాయ్‌ఖాన్ (1260-1295) ఆస్థానంలో ఉండేవాడు. ఐస్‌క్రీమ్ రహస్యం కుబ్లాయ్‌ఖాన్ మార్కోపోలోకు చెప్పాడు. మార్కోపోలో దీనిని వెన్నిస్ రాజాస్థానంలో ప్రవేశపెట్టాడు. మరో అయిదు వందల సంవత్సరాలకు ఐస్‌క్రీమ్ ప్రపంచం అంతా ప్రాకిపోయింది.

మనం ప్రతిరోజూ తినే వరి అన్నం

## నవ చైతన్యానికి మార్గం

మానవుడు ఏ మాత్రం ఖర్చు లేకుండా అతి చౌకగా అనుభవించగలిగిన విలాసం 'నవ్వు.' నవ్వు మానవ శరీరంలో రక్త ప్రవాహాన్ని ఉత్తేజపరుస్తుంది. హృదయాన్ని విస్తరింప జేస్తుంది. నరాలకు పటుత్వం కలిగిస్తుంది. పూర్తి మానవశరీర నిర్మాణానికి ఒక నవచైతన్యం కలిగిస్తుంది.

మిక్కిలి ప్రాచీనమైనది. క్రీస్తు పుట్టడానికి పూర్వం 5,000 సంవత్సరాలనుండీ ఇది వాడుకలో ఉంది. దీనికంటే ముఖ్యమైన విషయం ఈ ధాన్యం మొట్టమొదట మన దేశంలోనే ప్రారంభమైంది. భారతదేశం నుంచి తరువాత పర్షియా, మిడిల్ ఈస్ట్, ఆఫ్రికా, యూరప్ మరియు అమెరికా దేశాలకు విస్తరించింది.



నిజానికి వరి 17 వ శతాబ్దంలోనే అమెరికాలో ప్రవేశించింది! మెడగాస్కర్ నుంచి బయలుదేరిన ఒక సరకుల ఓడ సముద్రం మీద ఉండగా తుపానులో చిక్కుకుపోయింది. ఆ ఓడకు దక్షిణ కెరోలినా ఛార్లెస్టన్‌లో ఆశ్రయం లభించింది. ఆ ఓడ కాప్టెన్ సంతోషించి అతి వినయంగా చార్లెస్టన్ వాస్తవ్యులకు ఓడలో ఉన్న వరి విత్తనాలు బహూకరించాడు. ఈనాడు ఒక్క దక్షిణ కెరోలినాలోనే కాదు అర్కాన్‌సాస్, టెక్సాస్, కాలిఫోర్నియా మొదలైన ప్రదేశాలలో విస్తారంగా వరి సాగుబడి జరుగుతూంది; పుష్కలంగా పండుతూంది.

ఆమ్లెట్ మీ అందరికీ తెలిసినదే. ఇది కోడి గ్రుడ్లతోనే తయారుచేయాలని లేదు. ఇప్పుడు మనదేశంలో అనేక హోటళ్ళలో టొమాటో ఆమ్లెట్‌లు ఎంతో రుచిగా తయారు చేస్తున్నారు గ్రుడ్లతో తయారయే 'ఆమ్లెట్'కు ఆ పేరు ఎలా సార్థకమైందో తెలుసుకుందాం.

ఆమ్లెట్ కథ: స్పెయిన్ దేశపు రాజు ఒక రోజు ఊళ్ళో తిరుగుతూండగా ఉన్నట్టుండి ఆకలివేసింది. ప్రక్కగా ఒక పొలం ఉంటే అందులోకి వెళ్ళి ఒక రైతుని చూసి ఆకలివేస్తూంది, ఏమైనా పెట్టమని అడిగాడు. వెంటనే ఆ రైతు ఒక పెనం మీద రెండు కోడిగ్రుడ్లు అట్టులా పోసి ఇచ్చాడు. రాజు సంతోషించి ఈ రైతు ఎంత సూక్ష్మ బుద్ధి గలవాడు (Quel homme Leste) అని మెచ్చుకున్నాడు. ఈ హోమెలెస్ట్ (homme Leste) అనే మాట ఆమ్లెట్‌గా మారింది.

లార్డ్ సాండ్విచ్ అనే జమీందారు (Baron) ఆకలి కూడా లెక్కచేయక ఎప్పుడూ జూదం ఆడుతూ ఉండేవాడు. ఇతడి సేవకుడు ఇది గ్రహించి ఒక మాంసం ముక్కను రెండు రొట్టెముక్కల మధ్యపెట్టి అది తింటూ ఆడుకోమన్నాడు. ఆనాటినుండి ఇది వాడుకలోకి వచ్చింది. ఇప్పటికీ దాన్ని

---

## భారత దేశపు అతి ప్రాచీన వైద్య సంస్థ

భారత దేశంలో మద్రాస్ మెడికల్ కాలేజీ 150 సంవత్సరాల నాటి అతి పురాతనమైన వైద్య సంస్థ.

సాండ్ విచ్ అని ఆ జమీందారు పేరుతోనే పిలుస్తారు. కొన్ని తినుబండారాల పేర్లు చాలా విచిత్రంగా ఉంటాయి. వెల్ష్ రాబిట్ అనే వంటకం వేల్స్‌లో చాలా ప్రసిద్ధి పొందింది. నిజంగా దీనికి 'రాబిట్' (కుందేలు) కు ఏమీ సంబంధం లేదు. టోస్టుచేసిన రెండు రొట్టెముక్కలకు ఆవాలు, మిరియాల పొడిని వెన్నతో పట్టించి తయారు చేస్తారు. చాలా రుచికరంగా. పుష్టికరంగా ఉంటుంది.

తినడం, ఆహారం గురించి మాట్లాడుకుంటున్నాం కాబట్టి చెప్పుకోకతప్పదు. బ్రేక్‌ఫాస్ట్, లంచ్, డిన్నర్ అనేవి బ్రిటిషువారినుండి వచ్చినవే. 1890 వ సం.రం నుంచే ఆంగ్లేయులు ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు. దీనికిముందు ఇంగ్లండులో ఆంగ్లేయులు ప్రొద్దున బ్రేక్‌ఫాస్టు, రాత్రి డిన్నరు మాత్రమే తీసుకునే వారు 18 వ శతాబ్దంలో లేవడంతోటే ప్రొద్దున బ్రేక్‌ఫాస్ట్ అంటే మితంగా ఉపాహారం తీసుకోడం ప్రారంభమైంది. రాను రాను బ్రేక్‌ఫాస్ట్ అంటే పొద్దుటిపూట బాగా డుపునిండా తినడం అలవాటైంది ఈ బ్రేక్‌ఫాస్ట్‌లో ఒక్క కుటుంబమే కాదు బంధు )లు, మిత్రులు అందరూ చేరేవారు. పగలు 10 గంటలకు ప్రారంభించిన బ్రేక్‌ఫాస్ట్ ాహ్నం 1-00 దాకా సాగేది. ఈ బ్రేక్ ాస్ట్ 1860 సం. నాటికి చిన్న ఫలహారంగా ారిపోయింది. లంచ్ అనేది ప్రొద్దుటి బ్రేక్ ాస్ట్. రాత్రిపూట తినే డిన్నరు మధ్య ఏర్ప చుకున్న అల్పాహారం. లంచ్ ఏర్పడటం ేటే డిన్నరు సాయంకాలం 6 గం. నుంచి ాత్రి 8 గంటలకు మార్చేసారు. ●

# అడవుల ధ్వంసం వల్ల సాలీనా 100 కోట్ల డాలర్ల నష్టం



చెట్లను నరకడం వల్లనో తగలబెట్టడం వల్లనో సాలీనా 100,000 చ.కి మీ అటవీ ప్రదేశం ధ్వంసం అయిపోతూందని బ్రిటిషు శాస్త్రవేత్త నార్మన్ మెయర్స్ సూచిస్తున్నారు. భారతదేశం గంగానదీ ప్రదేశపు అడవులలో 40 శాతం గత 30 సంవత్సరాలలో నరికివేయబడ్డాయి. దీనివల్ల అనేక వరదలు, కరువులు సంభవించాయి. వర్షపాతాన్ని, వాతావరణాన్ని నియంత్రించి సాగుబడి భూములకు రక్షణనిచ్చేవి అడవులు. భారత దేశంలో సాలీనా అటవీ సంరక్షణ కార్యకలాపాలకు 10 లక్షల డాలర్లు ఖర్చు చేస్తూ ఉంటే మరో ప్రక్క వీటి ధ్వంసం చేయడంవల్ల 100 కోట్ల డాలర్ల నష్టం ఏర్పడుతూంది.

"తమకై యన్యహితార్థమాతుక జమల్ దైత్యుల్."

# బహుమతి పొందిన వ్యాసం

## విశ్వశాంతి ఆవశ్యకత

నా. వీరయ్య యాదవ్, ఓరుగల్లు.

ఈనాడు విశ్వంలో శాంతిలేదు. మానవ జీవితం కేవలం సత్యాన్ని జయించడమనే ధర్మంతో కూడుకుంది. ఆకలి నివారణకై శిక్షణను ఇచ్చి విశ్వచరిత్రకు ఖ్యాతిగాంచిన వారిలో ఒకరిగా బుద్ధుడు కేవలం విశ్వ శాంతికి అంకితమైనాడు. విశాల విశ్వంలో సర్వవేళలా నాగరికత నిపుణులు, వక్తలు, ప్రవక్తలు, మేధా సంపన్నులు, చైతన్య వంతులు కోకొల్లలున్నారు.

అశోకుడు అశాంతి యుద్ధరక్తంలో ఈది పశ్చాత్తాపంతో పరివర్తన కలిగి 'సత్యమేవ జయితే' అన్నాడు. నరజాతికి దుఃఖంలేని జీవితమే సంపూర్ణశాంతి అని ఆదర్శ చరిత్రను తీర్చి దిద్దాడు.

ఇందిరాగాంధీ ప్రజాస్వామ్య రాజ్యాంగ దక్షత పాలనతో 'శాంతిదూత' అనే స్నేహా మార్గంలో పేదరిక నిర్మూలనతో శస్త్రయుద్ధ ఖండన చేస్తూ శాంతి అన్వేషణలో యాత్ర జరిపి 'శ్రమయేవ జయతే' అన్నారు. ఈనాడు మానవజాతి రక్తంతోను, కన్నీటితోను తడిసింది ఎక్కడ వెదికినా రణరంగం కాని చోటే లేదు. భవిష్యత్తులో ప్రపంచంలో అందరూ ఏకమై 'శాంతితత్త్వం' ఒక గొంతుతో చాటించాలి. జాతిని పీడించే సాంఘిక ధర్మం సాగనీయకూడదు. అప్పుడు విశ్వశాంతి ఏర్పడుతుంది.

---

## పుత్రునికోసం ప్రాణత్యాగం



ఇండియా ప్రప్రథమ మొగలాయి చక్ర వర్తి బాబరు (1483-1530) యువరాజు హుమాయున్ మరణిస్తున్న వార్తవిని 'నీ కష్టాలు నాకు కలుగుగాక, నీ బాధ నాకు కలుగుగాక' అంటూ విలపించాడు. వెంటనే అదే రోజు డిసెంబరు 26. 1530 న బాబరు పుత్రుని పీడిస్తున్న రోగంతో మరణించాడు.

కుటుంబ విరోధక ఉద్యమాలు తార స్థాయిని అందుకుంటున్నాయి. చంద్రమండల యాత్ర దిగ్విజయంగా శాస్త్రజ్ఞానాభివృద్ధితో కొనసాగుతూంది. కాని విరోధానికి విరోధక చికిత్స కరువైంది. మానవుడికి నీతికి చోటు లేదు. అవినీతికి లోటులేదు. నీటికి కరువు. కన్నీటికి కరువులేదు. లోకనీతియే విశ్వ శాంతికి మూలం.

• • •

జి. అలిమేలు, కడప.

దేశంలో ఏమూల చూసినా అశాంతి ప్రబలి పోయింది. 'ఇరాన్. ఇరాక్ దేశాలమధ్య భీకర పోరాటం', 'శ్రీలంకలో తమిళుల ఊచకోత', 'లెబనాన్‌లో ముస్లిం క్రైస్తవుల మధ్య పోరాటం', 'పాలస్తీనా ప్రజలపై ఇజ్రాయిల్ పైవికులదాడి'; వివిధ జాతుల మధ్య విభేదాలే దీనికి ముఖ్యకారణం. రెండు ప్రపంచ యుద్ధాలను విన్నాం. వాటివల్ల ప్రపంచంలో ఎంత ప్రజానష్టం, ఎంత ఆస్తి నష్టం జరిగింది! మూడవ ప్రపంచయుద్ధం వస్తే భూగోళంమీద అసలు జీవరాశి సర్వ నాశనం అవుతుంది.

మొదటి ప్రపంచ యుద్ధకారణంగా ఏర్పడ్డ 'నానాజాతి సమితి' విఫలమైనందున రెండవ ప్రపంచయుద్ధం తరువాత ఐక్యరాజ్య సమితి ఏర్పడింది. ప్రపంచదేశాలమధ్య వారధిగా ఉంటూ విశ్వమానవ సంక్షేమం కోసం పాటు పడటం ఐక్యరాజ్యసమితి ప్రధాన లక్ష్యం. అగ్రరాజ్యాలు నక్షత్ర యుద్ధాలను గురించి ప్రకటిస్తున్నారు. ప్రపంచంలో ప్రజలు భయ భ్రాంతులై ఉన్నారు. ఇట్టి సమయంలో శాంతికై కృషిచేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

సమస్యా పరిష్కారానికి యుద్ధాలు, హింసాత్మక చర్యలు పరిష్కారాన్ని చూప లేవు. పరస్పర అవగాహన ద్వారా సమస్య లను పరిష్కరించుకోవాలి. విశ్వశాంతికి ప్రపంచంలో వివిధ దేశాలమధ్య అంతర్జాతీయ అవగాహన అవసరం. వివిధ జాతుల

---

## రష్యాలో 75 శాతం ప్రజలు పత్రికలు చదువుతారు



రష్యాలో 8,000 కు మించిన వార్తా పత్రికలు మొత్తం 1760 లక్షల కాపీలు అచ్చవుతాయి. 5,230 కి పైబడిన మాగ జైనులు, జర్నల్సు, ఇతర పత్రికలు మొత్తం అనేక కోట్లు అచ్చవుతాయి. రష్యా దేశంలో 75 శాతం ప్రజలు పత్రికలు చదువుతారు. 95 శాతం కుటుంబాలు పుస్తకాలు స్వంతంగా కొనుక్కుంటారు. ప్రత్యేక లైబ్రరీలు కూడా వారికి ఉన్నాయి.

"తమ కార్యంబు ఘటించుచున్ పరహితార్థవ్యాకృతుల్ మధ్యముల్."

మధ్య విభేదాలను తొలగించుకోవాలి. అంత ర్జాతీయ అవగాహన ఏర్పరచుకోవాలి. అదే విశ్వశాంతికి తోడ్పడుతుంది.

• • •

డి. చలపతిరావు, వరంగల్.

ఈ భూమిపై అడుగిడిన ప్రతి మానవుడు తన మనుగడను కాపాడుకోడానికి ప్రయత్ని స్తూనే జీవించడానికి కావలసిన అవసరాలను వెదకడానికి ప్రారంభిస్తాడు. ప్రకృతిని తన అవసరాలకు అనుగుణంగా మలచుకొనడంలో మానవుడు సాధించిన ప్రగతి ప్రశంసనీయం. భూమి ఉపరితలంపైన కూడా తన పరిశోధన లను సాగించడంకోసం చేసిన ప్రయత్నమే మానవుని చంద్రమండల యాత్ర తనకు సాటిగా మరో 'యాంత్రిక మనిషి'ని రూపొం దించి దాని ద్వారా తన చేతనలనికాని పను లను కూడా చేయించడంలో మానవుడు కృత కృత్యుడయ్యాడు.

కాని మనిషి తన మేధాశక్తిని ఉపయో గించి సాధించిన ఈ ప్రగతిని తన వినాశ నానికే వినియోగిస్తే సాధించిన ఈ ప్రగతికి అర్థంలేదు. నేడు ప్రపంచంలో ఎన్నో దేశాలు శాస్త్ర, సాంకేతిక రంగాలలో గణనీయమైన అభివృద్ధిని సాధించాయి సాధించిన ఆ ప్రగ తిని దేశ సౌభాగ్యానికి ఉపయోగించినప్పుడే ప్రగతికి సరిఅయిన నిర్వచనం లభిస్తుంది.

ప్రకృతిమీద ఆధిక్యతను సాధించినా అది ప్రపంచ మానవాళి ఐక్యతకు, శాంతిజీవనానికి, దేశ శ్రేయస్సుకి తోడ్పడాలి ప్రతిదేశం ఎన్ని అణుబాంబులను తయారుచేసిందని కాకుండా ఎంత పేదరికాన్ని నిర్మూలించగలిగింది అని ఆలోచించాలి ఈ లక్ష్యంతో ప్రపంచదేశాలు ఉద్యమిస్తే విశ్వశాంతి లభిస్తుంది అభివృద్ధి పొందిన దేశాలు అభివృద్ధి పొందుతూన్న దేశాలకు తమ సహాయ సహకారాలు అందిం చాలి. అప్పుడు ప్రపంచం శాంతితో వర్ధిల్లు తుంది. ●

## కంప్యూటర్ల సహాయంతో నడిచే టోకైడో ఎక్స్‌ప్రెస్



జపానులో టోకియో మరియు ఒసాకాల మధ్య ప్రయాణించే టోకైడో ఎక్స్‌ప్రెస్ కంప్యూటర్ల సహాయంతో నడుస్తుంది ఇంజ నీరు ఎక్స్‌ప్రెస్‌ను స్టార్ట్ చేసిన వెంటనే టోకియోలో కంట్రోలు కేంద్రంలో కంప్యూ టర్లు తమ పనిని ప్రారంభిస్తాయి. వేగాన్ని క్రమపరుస్తాయి. స్టేషనులలో ఎక్స్‌ప్రెస్‌ను నిలుపుతాయి, రిపేర్లు జరిగే చోట నెమ్మదిగా నడిపిస్తాయి. టోకైడో ఎక్స్‌ప్రెస్ గంటకు 200 కి.మీ. వేగంతో ప్రయాణం చేస్తుంది.

"....వ్రాసిన ధనంబు మసంటో కొంచెమో విను మరుభూమి కేగిన లభించును మేరువు చేరబోయినన్ ధనమధికంబురాదు...."

# సియర్స్ టవర్

ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన ఆఫీసు కట్టడం ఇల్లినాయిస్ చికాగో (అమెరికా) వాకర్ డ్రైవ్‌లో ఉన్న సియర్స్



రూబక్ అండ్ కంపెనీవారి జాతీయ ముఖ్య కేంద్రం సియర్స్ టవర్. ఇది 443 మీటర్ల (1454 అడుగుల) ఎత్తుగా ఉండే 110 అంతస్తుల బ్రహ్మాండమైన కట్టడం. దీని మొత్తం వైశాల్యం 44 లక్షల చదరపు టడుగులు (40.8 హెక్టేరులు).

ఆగస్టు 1970 వ సంవత్సరంలో నిర్మాణం ప్రారంభింపబడింది మే 4, 1973 కి పూర్తి అయినది కట్టడం పైన ఏర్పాటైన రెండు టీ.వీ. ఆంటెనాలతో చేరి దీని మొత్తం ఎత్తు 475.1 మీటర్లు (1559 అడుగులు). సియర్స్ కంపెనీలో పనిచేసే 7,000 మందితో చేరి అనేక ఇతర రంగాలలో ఇక్కడ మొత్తం పనిచేసే 16,700 మందికి 103 ఎలివేటర్లు, 18 ఎస్కలేటర్ల సౌకర్యాలు ఉన్నాయి ఈ పెద్ద కట్టడానికి మొత్తం 16,000 కిటికీలు ఉన్నాయి. నల్లరంగు అల్యూమినియం తాపడం చేసిన గోడలు, ఇత్తడి రంగు అద్దాల కిటికీలతో ఇది నగరంలో ఇతర ఆకాశ హర్మ్యాల మధ్య మిక్కిలి గంభీరంగా ఉంటుంది.

మిచిగాన్ సరస్సు ప్రక్కగా ఈ టవరును పూర్తిగా నిర్మించడానికి మూడు సంవత్సరాల కాలం పట్టింది. ముమ్మరంగా పనిచేసే సమయాలలో దగ్గం దగ్గర 1,600 మంది ఈ ప్రాజెక్టులో పని చేశారు. అన్ని విధాలైన ఆధునిక విద్యుత్ హంగులతోను, సౌకర్యాలతోను అతి తక్కువ విద్యుత్ వినియోగమయేటట్లు ఇది నిర్మింపబడింది.

టవర్ నిర్మాణానికి సుమారు 76,000 టన్నుల ఉక్కు ఉపయోగింపబడింది. దీని

---

## అసెంబ్లీ సభ్యులలో సగానికి సగం మూఢులు కారు!

ఒకసారి హౌస్ ఆఫ్ కామన్స్‌లో ఒక సభ్యుడు కోపంతో లేచి, "అసెంబ్లీలో సగానికి సగం మంది మూఢులు" అన్నాడు. మరునాడు దీనికి క్షమాపణ వేడుకోమంటే ఆ సభ్యుడు లేచి "ఈ అసెంబ్లీలో సగానికి సగం మూఢులు కారు" అన్నాడు.

---

"చాడీలు చెప్పుట కంటె అధికమైన పాపము లేదు."

నిర్మాణంలో ఉపయోగించిన కాంక్రీటు 5 మైళ్ళ పొడవు గల మిక్కిలి విశాలమైన రోడ్డుకు సరిపోతుంది. 16,000 ఇత్తడిరంగు అద్దాల కిటికీలు అమర్చబడ్డాయి. మొత్తం దీని గోడల వైశాల్యం 14 హెక్టేరులు పైగా ఉంటుంది. ఇవి పూర్తిగా ఝ్యారానోడిక్ అల్యూమినియం లోహంతో మెరిసిపోతూ ఉంటాయి. 2,22,500 టన్నుల భారమైన ఈ అద్భుత కట్టడం 144 రాతి స్తంభాల మీద లేవదీయబడింది. ప్రతి స్తంభం న్యూయార్కులోని లిబర్టీ శిల్పం (Liberty statue) అంత లోతుగా పాతబడి, బలిష్ఠమైన పునాదులతో నిర్మించారు.

ఈ సియర్స్ టవర్‌లో ఉపయోగింపబడిన టెలిఫోన్ కండక్టర్ వైరు ప్రపంచం చుట్టూ 1¼ సార్లు చుట్టవచ్చు. కట్టడంలో ఏర్పాటైన ప్రత్యేక 103 క్యాబ్ ఎలివేటర్ల విధానం 3 ప్రత్యేక జోనులుగా విభజింపబడింది. మధ్య మధ్య స్కైలాబీలు కూడా ఏర్పాటు చేయబడ్డాయి. లోపల ప్రయాణానికి డబుల్‌డెక్ ఎక్స్‌ప్రెస్ క్యాబులు ఏర్పాటు చేశారు. రెండు ఎక్స్‌ప్రెస్ ఎలివేటర్లు 1,353 అడుగుల ఎత్తు స్కైడెక్‌కు ఒక నిమిషం కంటే తక్కువ కాలంలో వెడతాయి.

ఆకాశాన్ని అంటే పెద్ద పెద్ద నిర్మాణాలలో ఇంతవరకూ ఎక్కడా లేని ప్రాణరక్షణ విధానాలన్నీ ఈ టవర్‌లో ఏర్పాటు చేయబడ్డాయి. ఆటోమాటిక్ స్ప్రింకర్లు, స్మోక్ డిటెక్టర్లు, అవసరమైనప్పుడు వెంటనే ఉపయోగ పడడానికి ఎమర్జన్సీ డీసెల్ జనరేటర్లు ఉన్నాయి. అధునాతనమైన ఆటోమేటిక్ విండో వాషింగ్ విధానం కూడా ఏర్పాటు చేసారు. ఇది సంవత్సరంలో 8 సార్లు టవర్‌లోని కిటికీలను పూర్తిగా కడిగి శుభ్రం చేస్తుంది. కాఫీషాపు, అనేక గదుల వసతి సౌకర్యం గల అందమైన రెస్టారెంటు 1500 మంది ఒకేసారి కూర్చోగల కేఫ్‌టేరియా ఈ టవర్‌లో ఉన్నాయి. క్రింది భాగంలో చిన్న చిన్న దుకాణాలతో పాటు బాంక్ సౌకర్యం కూడా ఉంది. దీనిని చూడడానికి వచ్చిన జనం 103 వ అంతస్తు వరకూ వెళ్ళవచ్చు. అంటే భూమట్టం నుంచి 1,353 అడుగులు పైకి. అమెరికా సుప్రసిద్ధ శిల్పి అలెగ్జాండర్ కాల్డెర్ చెక్కిన 'యూనివర్స్' మ్యూరల్ శిల్పం ఎంతో బ్రహ్మాండమైనది. ఈ శిల్పాన్ని వాకర్ డెవ్ —లో ఉంచారు.

('చికాగో ఇన్ ఫర్ మేషన్' సౌజన్యంతో)

# బార్బిరూసాలకు కోరలు



ఇండోనేషియా సెలెబేస్‌లో నివసించే వరాహజాతి బార్బిరూసాలకు ముఖం మీద కళ్ళక్రింది చర్మంలో నుంచి కోరలు పుట్టుకు వస్తాయి. మామూలు అడవి పందులకు పెదవుల మధ్య నుంచి బయలుదేరతాయి.

# ఉత్తమరచనలు చేయడం ఎలా?

చాలామంది యువతీ యువకులు ఈనాడు జర్నలిస్టులు అవుదామని అనుకుంటారు. లేకపోతే వ్యాసాలు, కథలు, కథానికలు వ్రాసి పత్రికల్లో తమ పేరు అచ్చవ్వాలని ఉబలాట



పడతారు. జర్నలిస్టుగా రాణించాలంటే మొట్ట మొదట చేయవలసిన పని స్వంతంగా వ్రాయడం అలవాటు చేసుకోవాలి. ప్రతిదినం వార్తా పత్రికల్లో వచ్చే వార్తలను జాగ్రత్తగా చదవండి. వాటిని మీ స్వంత మాటల్లో వ్రాయడం అభ్యాసం చేసుకోండి. అభ్యాసం చేసుకుంటున్న కొద్దీ వ్రాసే విధానం మెరుగు పడుతుంది. కొద్దిరోజుల్లోనే బాగా వ్రాయడం అలవాటవుతుంది. అభ్యాసం కూసువిద్య.

వ్రాయడం మీరు అనుకొనేటంత సులభమైన పని కాదు. జర్నలిస్టు ఎన్నో కష్టాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఎన్నో ఒడుదుడుకులను సహించుకోవాలి. చేపట్టిన పని వదలకుండా ఫలితం కలిగేవరకూ ప్రయత్నం చేస్తూ ఉండాలి. విఘ్నాలు కలుగుతాయనే భయంచేత అసలు ఆరంభించరు కొందరు. కొందరు ప్రారంభిస్తారు గానీ మధ్యలో ఏవైనా విఘ్నాలు సంభవిస్తే చేపట్టిన పనులు విడిచేస్తారు. ధైర్యవంతులు ప్రారంభించిన కార్యానికి మాటిమాటికి విఘ్నాలుకలిగినా విడచిపెట్టరు. ఓర్పు, పట్టుదల ఎంతైనా ఉండాలి. మంచి వ్రాయగల శక్తితోపాటు తగినంత ధైర్యం కూడా ఉంటే మీ కార్యసిద్ధికి అంతరాయాలు ఏర్పడవు.

---

## నేర్చుకున్న దాన్నిబట్టి ప్రవర్తించడం ఉత్తమోత్తమం

పరిశీలించడం ప్రథమ ధర్మం
పరిశీలించిన దానిని విమర్శించుకోవడం
ద్వితీయ ధర్మం
విమర్శించుకున్న దానిని
అర్థం చేసుకోడం తృతీయ ధర్మం
అర్థం చేసుకున్న దానిని బట్టి
నేర్చుకోడం చతుర్థ ధర్మం
నేర్చుకున్న దాన్నిబట్టి ప్రవర్తించడం
ఉత్తమోత్తమం.

-హార్వర్డ్ బిజినెస్ రివ్యూ

---

"పరమాత్మునికి పేర్లు అనంతం. అనంతమైన రూపాలను ఆరాధించి దైవాన్నిసాధించవచ్చు. ఏ పేరుతో ఏ రూపాన్ని ప్రార్థించినా దైవానుభూతిని పొందగలవు."

—శ్రీరామకృష్ణ పరమహంస

ఉత్తమరీతి రచనా నైపుణ్యానికి పుస్తక పఠనం ఎంతైనా అవశ్యకం. పఠనయోగ్యమైన గ్రంథాలు—చరిత్రలు, జీవిత సంగ్ర



హాలు, కాల్పనిక కథలు, ఆధ్యాత్మిక గ్రంథాలు. ఆయా విషయాలలో ప్రావీణ్యత పొంది ముక్కాకలు తీరినవారు ప్రత్యేక వ్యాసాలు, గ్రంథాలు రచిస్తారు. అటువంటి గ్రంథాలుగానీ, వ్యాసాలు కానీ చదివేటప్పుడు వాటిలో నూతన అభిప్రాయాలు, నవ్యభావాలు వెంటనే గ్రహించాలి.

పరిశీలనా స్వభావం అభివృద్ధి చేసుకోవాలి. ఈ విధంగా పరిశీలించడంవల్ల ప్రతి విషయం సూక్ష్మంగా, కూలంకషంగా, పరాకు లేకుండా చూడగలుగుతారు. చురుకుదనం, శ్రద్ధ, అభివివేశం, కుతూహలం, ఆకాంక్ష మొదలైన గుణాలు కలిగి ఉండడం ఆరోగ్యవంతమైన జీవితాభివృద్ధికి బంగారు బాట. చెట్లనుంచి పండిన పళ్ళు రాలుతూంటాయి. మనం అందరం చూస్తాం. చూస్తున్నాం. పండు పడిందని సంతోషించి ఊరుకుంటాం. చెట్టునుంచి రాలిన పండు భూమిమీదికి ఎందుకు పడింది? పైకి ఎందుకు వెళ్ళలేదు? మధ్యలో ఎందుకు నిలిచిపోలేదు? అనే విషయాలన్నీ తీవ్రంగా ఆలోచించాడు న్యూటన్ మహాశయుడు. భూమ్యాకర్షణ సిద్ధాంతాన్ని కనుగొన్నాడు.

వ్రాయదలచుకున్న విషయాన్ని వ్రాయడానికి ముందుగానే నిర్ణయించుకోండి. విషయానికి అవసరమైన అంశాలను ఎన్ని వీలుగా ఉంటే అన్ని సిద్ధంగా పెట్టుకోవాలి చేతికి అనువుగా ఒక తెల్లకాగితం లేకపోతే చిన్న పుస్తకం, మంచి పెన్సిలు ఉండి తీరాలి మీ అభిప్రాయాలు, వాడవలసిన మాటలు, పదాలు, సామెతలు మనసులో తట్టినప్పుడు ఎప్పటికప్పుడు వాటిని వ్రాసుకోవాలి. మంచి మంచి క్రొత్త భావాలకు వార్తాపత్రికలు, వార పత్రికలు గ్రంథాలు చదువుతూ ఉండాలి క్రొత్త విషయాలను తెలుసుకోవాలనే జిజ్ఞాస విస్తరింపచేసుకోవాలి. ప్రతి విషయం గురించి "ఎందుకు?" "ఎలా?" "ఎక్కడ?" అనే ప్రశ్నలకు జవాబులను తెలుసుకోవాలి.

అవసరమని తోస్తే జర్నలిజంకు సంబం

## దానంతట అదే డయల్ చేసుకునే టెలిఫోను

పేరు చెప్పటంతోటే దానంతట అదే డయల్ చేసుకునే టెలిఫోనును ఒక ఫ్రెంచి కంపెనీ క్రొత్తగా అభివృద్ధి పరచింది. సుమారు రూ. 6000/- విలువ చేసే ఈ క్రొత్త పరికరం నంబర్లు దాని కనుగుణంగా ఉండే పేర్లను రికార్డు చేసిన వ్యక్తి కంఠస్వరాన్ని బట్టే పని చేస్తుంది.

---

"లోభం కంటే మిక్కిలి నిందావహమైన దుర్గుణం లేదు."

దించిన ప్రత్యేక సంస్థలలో చేరి నైపుణ్యాన్ని అభివృద్ధి చేసుకునే సలహాలను పొందవచ్చు. లైబ్రరీలలో, పుస్తకాల షాపులలో కూడా జర్నలిజంకు సంబంధించిన గ్రంథాలు పలు రకాలు లభిస్తాయి. వీటిలో పరిశోధన విషయాలను సేకరించడం, శైలి, రచనా విధానం, తిరిగి వ్రాయడం, పునః పరిశీలన మొదలైన కిటుకులతో పాటు ఎన్నో సాంకేతిక రహస్యాలు లభిస్తాయి. ఒక రచనలో ఈ సాంకేతిక నైపుణ్యాలే పరిణితిని తెలియజేస్తాయి. జర్నలిజంలో ఉత్తమ రచన వ్యక్తిగత మానసిక నైపుణ్యాన్ని ప్రకటించాలి. మీ ప్రత్యేక రచనా శైలిని ఏర్పరచుకో. ఇది నిరంతరం కొనసాగేది దీనికి విషయాన్ని గురించి సంపూర్ణంగా తెలిసి ఉండాలి. ప్రతివారికి తెలియజేయాలనే కుతూహలం ఉండాలి మీరు వ్రాసే దాన్ని మీరే స్వంతంగా వ్యాఖ్యానించగలిగేట్టుగా ఉండాలి.

పాఠకలోకాన్ని ఎప్పుడూ మనస్సులో పెట్టుకుంటే సులభశైలిలో వ్రాయడానికి అనుకూలిస్తుంది. అందరికి పరిచితమైన మాటలు ఉపయోగించాలి. కష్టమైన పదాలు ఉపయోగించవద్దు అలాగని పద సంపదను పొందుపరచకుండా ఉండకూడదు. విశదంగా తెలియజేయడానికి ప్రయత్నించు.

వాక్యాలు చిన్నవిగా ఉండాలి. ఒక్కొక్క వాక్యంలో 20 కి మించి మాటలుంటే చదవడం కష్టమనిపిస్తుంది. సుప్రసిద్ధమైన రచనలలో వాక్యానికి 16, 17 మాటలకంటే అధికంగా ఉండవు. పెద్దపెద్ద సమాసాలతో మాటలు ఉపయోగిస్తే చెప్పదలచుకున్నదానిని మనసుకు హత్తేటట్టు చెప్పలేరు.

ఒక కథలో బిచ్చగాడు వచ్చి గుమ్మం దగ్గర "అమ్మా ధర్మం" అంటే "పో! పో! బియ్యంలేవు" అని వ్రాయడానికి బదులు "ఓయీ! భిక్షుకా మద్గృహంబున తండులంబులు నిండుకున్నవి పోయి రమ్ము" అని వ్రాస్తే ఎవ్వరికీ అర్థం కాదు. సరైన అర్థం తెలియజేయడం ఇంకాముఖ్యం. అందరూ చదివి ఆనందించేటట్టుగా ఉండాలి. చాలా మంది ఆత్మ సంతృప్తి కోసం వ్రాస్తారు. వ్రాయవలసిన విషయం, వ్రాసే శైలి ప్రతివారూ చదివి ఆనందించేదిగా ఉంటే మీ వాక్యాలకు, మీ రచనలకు ఒక నవ్యతను ఆపాదిస్తారు బైబిల్ చదివి చూడండి, చిన్న చిన్న వాక్యాలు. తేలిక మాటలలో యదార్థాలను ఎంతో గంభీరంగా వివరించబడ్డాయి. పదగుంభన శక్తి కలిగి చిన్న చిన్న పదములతో రచించువాడు 'ప్రతిభావంతుడు' మహాత్మా గాంధీ, రాజగోపాలాచారి రచనలు ఇటువంటివే. ●

---

(21 వ పేజీ తిరువాయి)

వాత 9 నెలల లోపున ఒకటి లేక రెండేసి నెలల వ్యవధిలో ఇవ్వాలి. రోగ నిరోధక శక్తి తగ్గిపోకుండా ఉండడానికి అదనంగా వాక్సీన్ మందు 'బూస్టర్' మోతాదు వాడతారు. బిడ్డ 1½ మొదలు 2 సం.వ వయస్సులో ఈ 'బూస్టర్' మోతాదు ఇవ్వవలసి ఉంటుంది. పిల్లలకు కోరింత దగ్గు (whooping caugh), టిటానస్ (Tetanus), డిఫ్తీరియా (Diphtheria) రోగాలు సోకకుండా DPT సంరక్షిస్తుంది. ('Unicef' సౌజన్యంతో) ●

---

# లుతూన్న పీజాటవరు

ప్రపంచ ప్రసిద్ధి పొందిన వాలుతూన్న పీజా టవరు (Leaning Tower of pisa) దాదాపు 800 సంవత్సరాలుగా వాలుతూనే ఉంది. ప్రతి సంవత్సరం ఈ వాలు కొద్ది కొద్దిగా పెరుగుతూ ఉంది. ప్రతి సంవత్సరం జూన్ 19 వ తేదీ ప్రొద్దున 5 గంటలకు ఇటలీ దేశస్థుడైన విజ్ఞానవేత్త టవరు ఎన్ని డిగ్రీలు వాలిందో పరిశీలిసాడు.



179 అడుగుల ఎత్తైన ఈ టవర్ ఇప్పుడు లంబానికి 16 అడుగుల 6 అంగుళాలకు పైగా వాలింది. టవరుపై గాలరీల నుంచి భూమి మీదికి విడిచిన రాయి టవరు గోడనుంచి 16½ అ॥ దూరంలో భూమిని తాకుతుంది. బొనాన్నో పిసానో 117? సం.లో ఈ టవరు నిర్మాణం ప్రారంభించాడు. ఇతడు 1185 సం.రం దాకా పనిచేసాడు. ఆ తరువాత మనిషి మాయమైపోయాడు. ఎక్కడా కని పించలేదు. అనాటికి టవర్ మూడున్నర అంతస్థుల వరకు లేచింది. ఆ తరువాత 90 సం.రాల దాకా ఎవ్వరూ ఏమీ పట్టించుకోలేదు. టవరు వాలుతూండటంవల్ల నిర్మాణం పూర్తి చేయాలనే ఉత్సాహమే పోయింది. తరువాత మరో శిల్పి పీజాటవరు నిర్మాణానికి పూను కున్నాడు.

వాలుతూన్న ఈ టవరును పడగొట్టి క్రొత్తగా కట్టడానికి బదులు దీనిమీద 3½ వర్తులపు అంతస్థులు నిర్మించాడు. 5, 6, 7 అంతస్థులను వాలుకి ఎదుటివైపుగా నిర్మించాడు.

7 గంటలుండే పైగోపురాన్ని 80 సం.రాల తరువాత మూడవ శిల్పి పూర్తి చేసాడు. పై గంటలలో మిక్కిలి భారవంతమైనది 3½ టన్నులు ఉంటుంది. టవరు నిర్మాణం పూర్తి కావడానికి సుమారు200 సంవత్సరాల కాలం పట్టింది.

ఈ వాలు రహస్యం అంతా పీజాభూమిలో ఉండే మెత్తటి మన్నుమీదే ఉంది. ఈ మన్ను 60 శాతం నీటితో కూడిన బంకమన్ను, ఇసుక. ఎంతోమంది శిల్పులు పెద్ద పెద్ద ప్లానులతో పీజా టవరును నిలబెట్టడానికి వచ్చారు. రోములో PWD ఆఫీసులో ఒక గోడకున్న పూర్తి షెల్ఫులన్నీ దీని ప్లానులతో నిండిపోయాయి.

(మిగతా 48 వ పేజీలో)

"లోభగుణమును వదలుట శాంతమునకు ముఖ్యకారణము."

# ఊస గ

టి. ఎస్. ఎన్. మూర్తి

ఊసరవెల్లి బల్లిజాతికి చెందిన జంతువు. తొండ ముదిరితే ఊసరవెల్లి అవుతుందంటారు. ఇది కొమ్మలమీద, పొదలమీద, అప్పుడప్పుడు భూమిమీదా మెల్లిగా ప్రాకుతూ కనిపించే అందవికారమైన ప్రాణి. అమిత




బద్ధక స్వభావం కలది. దీనితోక వాచీ స్ప్రింగ్‌లా ఉంటుంది. తోక ఒక కొమ్మకు చుట్టి గంటల తరబడి కదలకుండా పడుకుని ఉంటుంది. శరీరానికి ముందుభాగం తల చిన్న బొడిపిలా ఉండి రెండు ప్రక్కల రెండు కళ్ళు ఉబ్బెత్తుగా ఉంటాయి. ముఖ్యంగా దీని కాళ్ళ నిర్మాణం, చూపు, నాలుక, చర్మం, చర్మం రంగుల మార్పిడి ప్రత్యేకమైన లక్షణాలు కలిగి ఉంటాయి.

తోకతో కాకుండా ఇది సుమారు 12.5 సెం.మీ. పొడవుంటుంది. తోకతో చేరి దాదాపు 60 సెం.మీ. పొడవుదాకా ఉంటుంది.

దీని కాళ్ళు ప్లయర్లు (పటకారు)లా ఉంటాయి. తోక సన్నగా, నిడివిగా, చుట్టుకోడానికివీలుగా ఉంటుంది. ఈ రెంటి సహాయంతో చెట్లమీద చిన్న కొమ్మలు, రెమ్మలు పట్టుకుని పాకుతుంది. టెలిస్కోపు అమరికతో ఉండే పొడవైన నాలుక ముందుకు అతి వేగంగా చాచి చిన్న చిన్న పురుగులను ఆహారంగా పట్టుకుంటుంది. నాలుక చివర జిగురులాంటి లాలాజలం స్రవిస్తుంది. నాలుక చాచినప్పుడు పురుగులు, ఈగలు నాలుకకు అంటుకుంటాయి. వెంటనే అంటుకున్న ఎరతో సహా క్షణంలో నాలుక నోట్లోకిముడుచుకుంటుంది. శరీరంలో చలనం లేకపోయినా నాలుక రబ్బరులా సాగుతుంది. దీని నాలుక శరీరంకంటే కూడా చాలా పొడవుగా ఉంటుంది. ఒకేసారి రెండు

## కాలం మహిమ

కాలం—
నిరీక్షించే వారికి అతి తామసం
భయపడే వారికి అతి శీఘ్రం
విచారించే వారికి అతి దీర్ఘం
ఆనందించే వారికి అతి అల్పం
కాని ప్రేమించే వారికి కాలం
అనంతం.

—హెన్రీ వాన్ డైక్

"అనుకున్నది జరుగదు, తనకున్నది తప్పదు." —అమ్మ

దిక్కులకు గాని లేక ఒక కన్నుతో ముందు, మరో కన్నుతో వెనుకకు చూడగల శక్తి దీని కళ్ళకు కలదు. దీనికళ్ళు దేనికదే స్వంతంగా పనిచేయగలవు.

ఆంగ్లంలో సామెత "Changeable as a chemeleon"-అంటేనిమిషానికోరంగు- ఈ ఊసరవెల్లికి సంబంధించినదే. పుట్టినప్పుడు తెల్లగా ఉండే ఈ ఊసరవెల్లి ఎప్పటికప్పుడు శరీరం రంగులు మార్చేస్తూ ఉంటుంది. ఊదారంగునుంచి ఆకుపచ్చ, ఎరుపునుండి పసుపు, తెలుపునుండి నలుపు రంగులకు మారుతూ ఉంటుంది. దీని రంగు నిక్కచ్చిగా ఇది అని చెప్పడం కష్టం ఈ రోజు ఒక రంగులో ఉంటే 4, 5 రోజులలో మరో వర్ణంలోకి మారిపోతుంది. ప్రత్యేకంగా ఊసరవెల్లి శరీరంలో మానసిక, శారీరక ప్రేరకం వల్ల ఈ రంగుల మార్పిడి జరుగుతూంటుంది. ఒక్కొక్క పర్యాయం బాగా ఉద్రేకం పొందినప్పుడు వీటి శరీరం రంగు మారుతుంది అంతేగాని పరిసరానుగుణ్యంగా వర్ణం మార్చదు. ఇతర జంతువుల నుండి రక్షించుకోడానికి రక్షక వర్ణంగా మార్చుకోదు జిగురు వంటి లాలాజలం ఊరే పొడవైన నాలుకను అతి వేగంగా-అంటే రెప్పపాటు కాలంలో - ముందుకు జాపి ముడుచుకుంటుంది. ఇది తాబేలుకంటే కూడా అతి మెల్లిగా నడుస్తుంది. ఎవరైన పట్టుకోడానికి ప్రయత్నిస్తే కొరికి గాయం కలిగిస్తుంది. ●

(46 వ పేజీ తరువాయి)

ప్రపంచ మహాయుద్ధం సమయంలో వేసిన బాంబులు పీజా టవరును కదిలించి వేసాయి. గుండ్లు టవరుకు తగిలాయి. కాని టవరు చెక్కు చెదరలేదు. ఎన్నెన్నో భూకంపాలు వచ్చాయి. అయినా టవరుకి ఏమీ దెబ్బ తగలలేదు. 1839 లోను మరియు 1935లోను టవరు పునాదులు బలిష్ఠం చేయడానికి ప్రయత్నాలు జరిగాయి. దీనివల్ల టవరు వాలు మరింత ఎక్కువ అయింది. 14 500 టన్నుల భారంగల పీజా టవరు అపాయ స్థితిలో లేదని చెప్పలేం చాలాకాలం నుంచి టవరులో గంటలు కొట్టడం లేదు తీవ్రమైన కంపనాలు జాలుతున్న టవరుకు అపాయం కలిగించగలవంటారు. —

## క్రిక్కిరిసి పోయిన హాస్పిటలు




రెండు మూడు రోజులలో ఖాళీ అయిన వెంటనే బెడ్ ఏర్పాటు చేస్తా!

"తన్ను తాను విమర్శించుకోవడం వివేకం, ఇతరులను విమర్శించడం అవివేకం."

(18 వ పేజీ తరువాయి)

ం వర్షయ వర్షయ' అనే పాటలు పాడగా ంటనే కుంభవృష్టిగా వర్షం కురిపించదని. కాను వివారణ అయిందని వానుడి.

శ్రీ దీక్షితులకు ఇద్దరు భార్యలు. పెద్ద భార్యకు ఒక్క కుమార్తె. చిన్న భార్యకు సంతతి లేదు. ఈమెకు వస్తువాహనాలపై మోజు ఎక్కువ. రాజాశ్రయం చేసుకుంటే కొంత దారిద్ర్యబాధ తగ్గుతుందని తంజావూరు రాజును చూడమని భర్తను కోరుపెట్టింది అప్పుడు దీక్షితులు లలితరాగంలో శ్రీ సూక్తాన్ని అనుసరించి "హిరణ్మయీం లక్ష్మీం సదాభజామి హీన మానవాశ్రయం త్యజామి స్థిరతర సంపత్ప్రదాం" అనే కీర్తనతో లక్ష్మీదేవిని సంస్తుతించి, తృప్తి పొంది, "మంగళదేవతయా తత్వయా బహు మానితోహం" అని కృతజ్ఞతను కూడా చెప్పుకున్నారు.

పశ్చిమ కనుమలలో 'శబరిమలై అయ్యప్ప' దర్శనం చేసి వసంతరాగంలో 'హరిహర పుత్రా' అనే కృతిని గానంచేశాడు. గురువాయూరు సందర్శించి అచ్చటి శ్రీకృష్ణుని 'శ్రీకృష్ణం భజమానస' అని కీర్తించాడు. ఇతడి కీర్తనలలో గోపుచ్ఛ స్రోతో వాహ యతి మరో గొప్ప విశేషం. శ్రీరాగంలో రచించిన శ్రీ వరలక్ష్మీ నమామ్యహం వసుప్రదే శ్రీ సారసపదే, రసపదే, సపదే, పదే....ఆనందభైరవి రాగంలో త్యాగరాజ యోగ వైభవం, సదాశివం సదాశ్రయామి త్యాగరాజ యోగవైభవం, అగరాజ యోగ వైభవం, రాజయోగవైభవం, యోగవైభవం, వైభవం, భవం, మొదలైనవని ఎన్నో ఉదాహరణలు ఉన్నాయి. ఇతడి కృతులు పండితులకు మిక్కిలి ఆస్వాద యోగ్యములు. కీర్తనలు సమాస ఘటితమైన శయ్యలో నడుస్తాయి.

శ్రీ ముత్తుస్వామి దీక్షితుల రచనలు నిర్మలాకారంతో ఆరాధ్యవస్తువు సర్వలక్షణ లక్షితంగా వర్ణించబడుతుంది. కీర్తించిన ప్రతి దేవ మూర్తి భేదాలు, వివిధగుణాలు, రూప లక్షణాలు విశదంగా ఉంటాయి. 'సోహం బ్రహ్మాస్మి' అనే తత్త్వంతో సగుణోపాసనతో రచించిన ఇతడి కీర్తనలు ఇతడి సంస్కృత భాషా పాటవాన్ని, ఛందోవ్యాకరణ వశీకరణాన్ని స్పష్టంచేస్తాయి. శబ్దాలంకారాలతో లయ మాధుర్యంతో చెవులకు రసవత్తరంగా ఉంటాయి.

ఇతడికి శిష్యులు చాలామందే ఉన్నారు. తమ్ములైన చిన్నస్వామి దీక్షితులు, బాలస్వామి దీక్షితులు ఇద్దరే కాక తిరుక్కడైయూరు భారతి, వీణా వేంకటరామయ్యర్, తేవూరు సుబ్రహ్మణ్య అయ్యరు, శుద్ధ మద్దళం తంబియప్ప, భరతనాట్య ప్రవీణుడు కొరనాడు రామస్వామి, నాగస్వర విద్వాంసుడు తిరువమందూరు బిల్వవనం, తంజావూరు సోదరులు పొన్నయ్య, చిన్నయ్య మొదలైన వారు పెక్కుమంది. తిరువారూరులోని కమలమ్మ, వళలార్ కోయిల్ అమ్మణి అనే దేవదాసీలు ఇతడి వద్ద గానం నేర్చుకుని నాట్యాభినయ యుక్తంగా గానం చేసేవారుట.

—[illegible]

"ఉపకారము చేసిన వాని కుపకారము చేయుట ధర్మము."




కోట్లాది ప్రజల హృదయాలలో
మన స్వాతంత్ర్య సమర వీరులు వెలిగించిన
స్వేచ్ఛా జ్యోతి ప్రకాశిస్తూండగా
ఎట్టి పెనుతుపానైనా
ఆ జ్యోతిని ఆర్పివేయగలదా?

మన గతినే మార్చివేసి
మనల్ని స్వతంత్రులుగా చేసింది ఆ వెలుగే

శక్తి సంపన్నులుగా
ఆత్మ నిర్భరులుగా కూడా చేసింది ఆ వెలుగే

ఆ వెలుగే
మన ఆశాకిరణం
# మన అమర జ్యోతి

davp 85/189

# నిజాలు-నిదర్శనాలు

## 50 లక్షల మంది కంటి పొరతో బాధ పడుతున్నారు:

భారతదేశంలో సుమారు 60 లక్షలమంది కంటిపొరతో బాధపడుతున్నారు 25 లక్షల మంది అంధత్వంతో బాధపడుతున్నారు. ఈ విధంగా బాధపడేవారిలో 20 శాతానికి గ్రాఫ్టింగ్ విధానంతో దృష్టిని కలిగించవచ్చు.

* * *

## ఒక రూపాయి నాణాన్ని తయారుచేయడానికి 52.81 పైసలు ఖర్చు:

ఒక రూపాయి నోటును తయారుచేయడానికి 4.91 పైసలు మాత్రమే ఖర్చు అవుతుంటే, ఒక రూపాయి నాణాన్ని తయారు చేయడానికి 62.81 పైసలు ఖర్చు అవుతుంది. రూపాయి నోటు 6 మాసాలపాటు ఉంటే, రూపాయి నాణెం సుమారు 15 మొదలు 20 సం. రాల పాటు ఉంటుంది. ఒక సంవత్సరం పాటు ఒక రూపాయి నోటుని చలామణిలో ఉంచడానికి 9.82 పైసలు ఖర్చు అయితే, ఒక రూపాయి నాణానికి 2.64 మొదలు 3.52 పైసలు ఖర్చు అవుతుంది.

* * *

## సరకులను చేపట్టడంలో బొంబాయి రేవు ప్రథమ స్థానం:

భారతదేశంలో మొత్తం 10 పెద్ద ఓడ రేవులు 1983_84 లో 1001.8 లక్షల టన్నుల సరకులను చేబడితే, 1984_85 లో 1067.4 లక్షల టన్నులు చేబట్టాయి. బొంబాయి రేవు 252 లక్ష టన్నుల సరకు

## మాడ్రిడ్ జూలో పాండా!



యూరపు స్పెయిన్‌లో మాడ్రిడ్ జూలో ప్రదర్శింపబడిన రాకాపి పాండాపిల్ల 'చుబిన్' మిక్కిలి అమూల్యమైనది. దీని విలువ 1,50,00,000 లక్షల డాలర్లు!

"ఒక్కడే కార్యాలోచన చేయకూడదు."

అను చేబడుతూ ప్రథమ స్థానాన్ని నిలుపు తుంది. దీని తరువాత గుజరాత్‌లోని కాండ్ల రేవు 157.4 లక్ష టన్నులు, మద్రాసు రేవు 150 లక్ష టన్నులు, మార్మగోవా 145 లక్ష టన్నులు వరుసగా చేపట్టాయి

## ఆంధ్ర ప్రదేశ్‌లో 11.7% బాల కార్మికులు:

గ్రామ సీమలో బాల కార్మికులు కేరళలో 1 శాతమైతే ఆంధ్రలో 11.7 శాతం. పంజాబ్‌లో పనిచేసే బాలికలు 0.3 శాత మైతే ఆంధ్రలో 10.5 శాతంఅని ఇటీవలి లెక్కలవల్ల తేలింది.

• • •

## పబ్లిక్ సెక్టారు బ్యాంకులలో డిపాజిట్లు రెట్టింపు:

పబ్లిక్ సెక్టారు బ్యాంకులలో గత 5 ఏళ్ళలో డిపాజిట్లు సుమారు రెండింతలు అయాయి 1984 లో డిపాజిట్లు రూ.63,102 కోట్లకు పెరిగింది.

• • •

## సాలీనా 60 వేల టన్నుల

సామాన్యంగా భారతదేశం సుమారు 60,000 టన్నులు కాన్డ్ మాంగోస్ (డబ్బాల లోకి ఎక్కించిన మామిడి) ఉత్పత్తి చేస్తుంది. దేశాలకు సుమారు 25,000 టన్నులు, పశ్చిమ ఆసియా, యూరప్, అమె రికా దేశాలకు 15,000 టన్నులు ఎగుమతి చేస్తూంది. దీనివల్ల రూ. 35 కోట్ల విదేశీ మారకాన్ని సంపాదించుకోగలుగుతూంది.

## 550 లక్షల మందికి దృష్టి లోపం:

భారతదేశంలో 550 లక్షల మంది అనేక రకాల దృష్టి లోపాలవల్ల బాధపడుతున్నారు. దీనితో పాటు సాలీనా 40,000 మంది పిల్లలు నివారించగల అంధత్వంవల్ల బాధ పడుతున్నారు. దేశంలో కంటి సమస్యలను ఎదుర్కోడానికి 40,000 వైద్యులు అవసరం ఉంది. కాని 5,000 మంది కంటి వైద్యులు మాత్రమే ప్రస్తుతం ఉన్నారు.

## జ్ఞానగుళికల పోటీ

(ఆగస్టు 1985)

"తప్పులెన్నువారు తండోప తండంబు
ఉర్విజనుల కెల్ల ఉండు తప్పు."

—ఎమ్.ఎస్. సత్యనారాయణమూర్తి,
కళింగపట్నం.

• • •

"తప్పులెన్నువారు
తమ తప్పు లెరుగరు."

—ఎ జి.కె మూర్తి
మచిలీపట్నం (కృష్ణాజిల్లా)

---

"ధనము, విద్య, కీర్తి, ఈ మూడును అవివేకుల యందు మదమును వివేకుల యందు అణకువను, వినయమును కలిగించును."

# కలం ప్రభావం

అద్భుతమైన ప్రపంచ చారిత్రక విషయాలు ఎన్నో వ్రాసి రికార్డు కావింపబడ్డాయి. అంటే అది కలం ప్రభావమే. ప్రపంచ యుద్ధాలు, దిగ్విజయాలు, దేశ స్వాతంత్ర్యాలు, మహా సామ్రాజ్యాల సంస్థాపన, గొప్పగొప్ప వంశాల



గాంధీజీ

స్థాపన, వాటి పతనాలు, మహోత్సవాలు, దర్బారులు — మొదలైనవాటిని గురించి కలం లేకపోతే మనకు తెలిసి ఉండేదే కాదు.

మానవులు లోకంలో చూచిన విషయాలను, పొందిన అనుభవాలను, కలిగిన భావాలను మన కందరికీ శాశ్వతానందాన్ని కలిగించే ఋట్లు వ్యక్తీకరించేదే వాఙ్మయం. సాహిత్యం.

ఒక యుగంలో వెలసిన వాఙ్మయం ఆనాటి జనుల స్థితిగతులు, భావాలు, మనోవృత్తులు, ఆశలు. ఆశయాలు, రాజకీయ, సాంఘిక, నైతిక మత పరిస్థితులను యథాతథంగా ప్రతిబింబిస్తుంది. ఆ నాడు జీవించిన మహాత్ముల జీవితాలను ప్రతిఫలిస్తాయి.

మహర్షి వేదవ్యాసుడు రచించిన భారతాంతర్గతమైన గీత భారతీయులకు పరమ పూజ్యము. ప్రమాణము అయిన గ్రంథము. విశ్వ సాహిత్యంలో దీన్ని మించినది మరొకటి లేదు. భరత మహాముని రచించిన నాట్య శాస్త్రం, తెలుగులో నన్నయ, తిక్కన, ఎర్రన లు రచించిన మహాభారతం. పోతన భక్తి భరితమైన భాగవతం, త్యాగయ్య అపూర్వ కీర్తనలు, క్షేత్రయ్య శృంగార పదాలు కాల గర్భంలో ఏనాడో కప్పబడిపోయి ఉండవలసి

## మీరైతే...?

(ఆగస్టు 1985)

(శరీరాంగాల విక్రయం వ్యాపారంగా పరిణమిస్తే?)

"బ్రతుకు విలువ దిగజారిందని మౌనంగా రోదిస్తా."

— పి. కృష్ణకుమారి, ఒంగోలు (ప్రకాశం జిల్లా)

• • •

"అంగాలు అమ్ముకుని సొమ్ము చేసుకుంటూ, వికలాంగుణ్ణయి ఉద్యోగం సంపాదిస్తా."

— వి జగదీశ్. వరంగల్.

---

"సత్యమునకంటె అధికమైన గుణము లోకమున లేదు."

నవే. అలాగే ఆంగ్ల భాషలో అరిస్టాటిల్, సోక్రటీస్ వంటి తత్వవేత్తల తత్వచింతనలు, డిబస్సీ (Debussy), చాపిన్ (Chopin), బీథోవెన్ (Beethoven) వంటి సుప్రసిద్ధ



షేక్స్పియర్

ఆంగ్లేయ గాయకుల సంగీత రచనలు, టెన్నిసన్, వర్డ్స్‌వర్త్, బైరన్ వంటి ఆంగ్లేయ కవుల పద్య రచనలు కలం లేకపోతే మనకు సంక్రమించేవే కావు. ఇదేవిధంగా వివిధ భాషలలోను.

నెల్సన్, విన్‌స్టన్ చర్చిల్, జాన్ కెనడీ, మహాత్మా గాంధీ వంటి దేశ నాయకుల ధైర్య సాహసాలు, దేశభక్తి మొదలైన వివరాలు వ్రాసి ఉండకపోతే వీటిని ఏనాడో మనం విస్మరించి ఉండేవాళ్ళం కదా!

వారన్ హేస్టింగ్స్‌పైన ఎడ్మండ్ బర్క్ (Edmund Burke) దోషారోపణ, అబ్రహాం లింకన్ గెట్టిస్‌బర్గ్ ప్రసంగం మొదలైనవి మనకు ఉన్నత ఆశయాలను, స్ఫూర్తిని కలిగిస్తాయి. వాల్మీకి, శ్రీహర్షుడు, కాళిదాసు, భవభూతి, పోతన, శ్రీనాథుడు, షేక్స్పియరు, మార్లో, హార్డీ, షెల్లీ, కీట్సు వంటి మహామహా లెందరెందరో ప్రపంచ ప్రఖ్యాతిని పొందారంటే కలం వల్లే

రాజకీయ రంగంలో కలం మహిమ అంతా ఇంతా కాదు. ఏ కొద్ది నిమిషాలలోనో వ్రాసిన నాలుగు ముక్కలు రాజ్యాలను తలక్రిందులు చేసేస్తాయి.

ఏకాంత జీవనం గడిపే కారాగార వాసులకు ఉత్తమ మిత్రులు ఇద్దరు - కలం, కాగితం. ఈ విధంగా ఎందరెందరో మహానుభావులు ప్రఖ్యాతిని పొందారు. జవహర్‌లాల్ నెహ్రూ రచించిన 'డిస్కవరీ ఆఫ్ ఇండియా', రాజాజీ వ్రాసిన భారత రామాయణాదులు, భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి హిస్టరీ ఆఫ్ ది కాంగ్రెస్, ఉన్నవ వారి మాలపల్లి, జాన్ బన్‌యాన్ (John Bunyan) పిల్‌గ్రిమ్స్ ప్రోగ్రెస్ చెప్పుకోదగినవి. ఇట్లే వివిధ దేశాలలో వివిధ భాషలలో అనేక ఉద్గ్రంథాలు వెలిసాయి.

ఇక ఉత్తరాల మూలంగా ఒక వ్యక్తి తన భావాలను, అనుభూతిని, ప్రేమను, అనుబంధాన్ని వ్యక్తీకరించుకుని హృదయంలో కరుడు గట్టుకుపోయిన మానసిక ఆరాటాన్ని ఇతరులకు తెలియజేసుకుని ఆత్మశాంతిని పొందగలుగుతున్నాడు. ఇదీ కలంతోనే సాధ్యం.

కలం ప్రభావంవల్లనే మానవలోకం కీర్తి, ప్రఖ్యాతి, సౌందర్యం, విజాయితీ, జ్ఞానం, ధర్మం, నీతి నిలబెట్టుకోగలుగుతూంది.

"ఒంటరిగా మార్గమందు నడువరాదు."

# వీరిని గురించి తెలుసుకోండి

**సిగ్మండ్ ఫ్రాయిడ్ (1856-1939) :**

ఆస్ట్రియా దేశపు మనస్తత్వవేత్త. కలలను విశ్లేషించి వ్యాఖ్యానించడం, మనస్తత్వ విశ్లేషణ ప్రారంభించాడు మనస్సుకు సంబంధించిన కాన్షస్ భావాలను, సబ్ కాన్షస్ భావాలను ప్రవేశపెట్టాడు. బాల్యదశలో లైంగిక ప్రవృత్తి. ప్రాయంలో దాని ప్రభావం మొదలైన విషయాలను వ్యక్తీకరించాడు



SIGMUND FREUD

• • •

**డా. రాజేంద్రప్రసాద్ (1884-1963) :**

భారతదేశపు తొలి అధ్యక్షుడు. ఇతడు బి.ఏ.ఎమ్.ఏ, ఎల్ ఎల్.బి మరియు ఎమ్ ఎల్ పరీక్షలలో ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణుడయాడు. భారతదేశపు అధ్యక్షుడుగా ముఖ్యంగా రాజ్యాంగ సంవిధానాన్ని క్రోడీకరించాడు. 1950 వ సం. లో భారతదేశపు అధ్యక్షుడుగా ఎన్నుకోబడి రెండుసార్లు ఆ ఉన్నత పదవిని అధిష్ఠించి 1962 వ సం. లో విరమించుకున్నాడు.

# పాఠకుల అభిప్రాయాలు

(ఆగస్టు 1985)

"మనిషి దేవుడు కానక్కరలేదు
పశువుగా కాకుంటే అదే చాలు."

—గుడ్ల సంజీవరావు,
కల్యాణ సింగుపురం, (ఒరిస్సా)

• • •

"కలిమి కోరుట కన్న
చెలిమి పెంచుట మిన్న,
చెలిమి పెంచుట కన్న
చేయూత నిచ్చుట మిన్న."

—పి. హెచ్. శ్రీనివాసరావు, ఖమ్మం.

• • •

" 'కారు' లేదని మనం బాధపడవద్దు!
నడవడానికి 'కాళ్లు' ఉన్నందుకు
సంతోషిద్దాం!"

—బిక్కుమారి రాజేశ్వర్,
కోరట్ కల్ (ఆం.ప్ర)

"ఆత్మ విశ్వాసం అలవరచుకోవాలి,
మహోద్భుతాలను సాధించడానికి దృఢనమ్మకం మూలం." -స్వామి వివేకానంద

**టంగుటూరి సూర్యకుమారి :**

సుప్రసిద్ధ సినీతార, గాయకురాలు, నాట్యకర్త. అనేక తెలుగు చిత్రాలలో నటించింది. ఇప్పుడు లండన్ నగరంలో ఇండియా పెర్ఫార్మింగ్ ఆర్ట్సుద్వారా భారతీయ నాట్యకళకు, సంగీతకళకు అమూల్యమైన సేవ చేస్తూంది. రవీంద్రనాథ్ టాగూర్ 'కింగ్ ఆవ్ ది డార్క్ చేంబర్'లో నటించి 'ఆవ్ బ్రాడ్వే' అవార్డును గ్రహించింది.

• • •

**ఉమర్ ఆలీషా (1885-1945) :**

ఇస్లాం మతస్థుడు. ఆంధ్రప్రదేశ్ తూర్పు గోదావరిజిల్లా పిఠాపురం జన్మస్థలం. మాతృభాష ఉర్దూ. తెలుగులో సరసంగా కవిత్వం చెప్పిన కవి. 14 ఏండ్ల వయస్సులోనే కవిత్వం చెప్పి 18 వ ఏట 'మణిమాల' అనే నాటకాన్ని ప్రచురించాడు. సేవావృత్తిని అంగీకరించక భాషాసేవకు, దేశసేవకు జీవితాన్ని గడిపిన దేశాభిమాని. తెలుగులో ఇతడు 'విచిత్ర బిల్హణీయము, చంద్రగుప్త, అనసూయ' మొదలగు నాటకాలు, ఉమర్ ఖయామ్, మహమ్మద్ ప్రవక్త చరిత్రము మొదలగు పద్యకావ్యాలేకాక నవలలు, ఖండకావ్యాలు 50 కి మించి రచించారు.

• • •

**వల్లభాచార్యులు (1473-1531) :**

ఆంధ్రుడు, గొప్ప విద్వాంసుడు. ఆచార్యత్రయం అని ప్రఖ్యాతి చెందిన శంకర, రామానుజ, మధ్వాచార్యుల తరువాత వాల్గవవాడు. జ్ఞాన, కర్మ, భక్తి సిద్ధాంతాలకు క్రొత్త అర్థాలు చెప్పి 'పుష్టిమార్గం' వ్యాపింపజేశాడు. పరిశుద్ధమైన ప్రేమతో పరమేశ్వరుని ఆరాధించి ప్రేమను తనలో నిబ్బంధించుకుని ఈశ్వర సాన్నిధ్యంలో విహరించడం పుష్టిమార్గముయొక్క విశిష్టత. గుజరాత్, రాజస్థాన్, ఉత్తరప్రదేశ్ పశ్చిమ ప్రాంతాలలో వల్లభాచార్యుల మతం ప్రచారంలో ఉంది ఎన్నో తెలుగు కుటుంబాలు ఈ మత ప్రచారానికి పై ప్రదేశాలలో నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. వేదాలలో వచ్చే సందేహాలు భగవద్గీతలోనూ, భగవద్గీతలోని సందేహాలు బ్రహ్మసూత్రాలలోనూ, బ్రహ్మసూత్రాలలోని సందేహాలు భాగవతంలోను తీరగలవని నిరూపించాడు. ●

(16 వ పేజీ తరువాయి)

రకరకాల ఔషధాలు ఉన్నాయి. డెక్స్ట్రో ఆంఫెటామైన్ (Dextroamphetamine) లేక మెథామ్ఫెటమైన్ (Methamphetine) లను మించిన ఔషధాలు లేవు. దీనివల్ల 1. నిద్రాభంగం. 2. విరేచనాలు మొదలైనవి కలగటం సహజం. ఫెన్ఫ్లూరామైన్ (Fenfluramine), పాండిరాక్స్ (ponderox) పాండిమిన్ (pondimin) తీసుకుంటే నిద్రాభంగం కలుగకపోయినా విరేచనాలు కలిగి తీరతాయి. క్రమ క్రమంగా మెల్లిగా పని చేసే ఫెనో మెట్రాజైన్, హైడ్రోక్లోరైడ్ 25, 50 మరియు 75 మి గ్రా వంటివి విదేశాలలో లభిస్తున్నాయి. వైద్యుల సలహాలను తీసుకునే వీటిని ఉపయోగించాలి. లేకపోతే శరీర ఆరోగ్యానికి హానికరం. ◖

"నీవు ఆశించే శాంతి నీలోనే ఉంది, ఎంత ప్రయత్నించినా ఇంకోచోట లభించదు. ఈ సత్యం అందరికీ తెలియదు." —స్వామి శాంతానంద

# మంచినీళ్లు మందును మించిన ఔషధం

ఔషధాలవల్ల రోగాలు నయమవుతాయి కాని ఈ ఔషధాలు ద్రవరూపంలో కొన్ని, భస్మరూపంలో కొన్ని, గుళికలు, మాత్రలుగా



కొన్ని ఉంటాయి. మోతాదులు తీవ్రంగా, ఘాటుగా ఉండవచ్చు: సున్నితంగా, సౌమ్యంగా ఉండవచ్చు. వీటి ధర ఎక్కువగా ఉండవచ్చు: తక్కువగా ఉండవచ్చు. కొంతమంది రోగులకు ఇచ్చిన మందు మోతాదు తట్టుకునే శక్తి ఉంటుంది. కొందరు భరించలేరు. కొందరికి మందులు పడవు - వికటిస్తాయి. మందులవల్ల మరికొన్ని రోగాలు కూడా పట్టుకుంటాయి. కాబట్టి రోగనివారక మందుగా ఔషధం కంటే ఉత్తమమైనది. సౌమ్యమైనది, నిరపాయకరమైనది ఎందుకు వాడకూడదు? సాధారణంగా చిన్న చిన్న రోగాలకు, జబ్బులకు ఔషధాలు అనవసరం.

"ద్రవ్యాదష్ట గుణం క్షీరం
క్షీరాదష్ట గుణం పయః"

'మందుకంటే 8 రెట్లు మంచివి పాలు. పాలకు 8 రెట్లు ఉత్తమమైనది నీరు అని ఆయుర్వేదంలో చెప్పారు.

కొన్ని రోగాల నివారణకు సంరక్షణకు ఉపశాంతికి ఔషధాలకంటే నీరు సర్వోత్తమమైనది.

నీటిచే నివారించుకోదగినవి :

1. విరేచనాలు, అతిసారం కడుపులో పురుగులు చేతులు వెచ్చని నీటితో శుభ్రం చేసుకుని మరగబెట్టిన నీటిని త్రాగండి.

2. చర్మరోగాలకు, దురద, దద్దుర్లు: రెండు మూడు పర్యాయాలు శుభ్రంగా స్నానం చేయాలి ముఖ్యంగా పనిచేసిన తరువాత చెమట పట్టినప్పుడు స్నానం చేయాలి.

(8 వ పేజీ తరువాయి)

ఫాల్కే అవార్డు గ్రహించిన మొదటి మహిళ:

దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును గ్రహించిన మొదటి మహిళ దేవికారాణి.

• • •

సూర్య కిరణాలు 8 నిమిషాలు:

సూర్యకిరణాలు నింగి నుండి నేలను తాకడానికి 8 నిమిషాలు పడుతుంది. ●

"పరులకు గల ఆధిక్యమును చూచి సహింపని వాడు వ్యాధిలేని దుఃఖమును అనుభవించును."

3. గాయాలు, నెత్తురుకారుట, టెటా నస్: గాయాలను బాగా నీటితోను, వెన్నెల తోను కడిగి పొడిగుడ్డతో అద్ది తుడవాలి.

నీటితో చికిత్స:

1. విరేచనాలు - అతిసారం: బాగా మంచినీళ్ళు, పళ్ళరసం త్రాగాలి.

2. తాపజ్వరం: ముఖంమీద తడిగుడ్డ పెట్టండి.

3. సాధారణ మూత్ర రోగాలు: (మూత్ర విసర్జన సమయంలో మంట) ఎక్కువగా మంచినీటిని గానీ, బార్లీ నీటిని గానీ త్రాగండి.

4. జలుబు, దగ్గు, ఆస్త్మా, నిమోనియా: మరగకాచిన నీటిని ఎక్కువగా త్రాగాలి. నీటి ఆవిరి పీల్చాలి.

5. గొంతుపుండు: ఉప్పుతో వేడినీటిని పుక్కిలించాలి.

6. బెణుకులు, నొప్పులు, కండరాల బిగువు: వేడినీటి కాపడం.

7. ముక్కు దిబ్బడ: ఉప్పునీటిని ముక్కులోకి పీల్చాలి.

8 ఒళ్లు దురదలు, మంటలు: చల్లని నీటితో ఒత్తడం.

9. మలబద్ధత: ఎక్కువగా నీళ్ళు త్రాగండి.

10. పులి త్రేనుపులు, గుండెమంట: పాలు త్రాగండి. ●

## ప్రపంచంలో 6000 లక్షల టెలిఫోనులు



ఇంటర్ నేషనల్ టెలి కమ్యూనికేషన్స్ పానెల్‌వారి నివేదిక ప్రకారం ప్రపంచంలో సుమారు 6000 లక్షల టెలిఫోనులు ఉన్నాయి. అయితే వీటిలో 75 శాతం 9 దేశాలలో మాత్రమే ఉపయోగపడుతున్నాయి. గ్రామీణ ప్రాంతాలలో నివసించే జనాభాలో 75 శాతానికి ఇంకా టెలిఫోను సౌకర్యం లేదు.

అమెరికాలో టెలిఫోనులు అత్యధికం. సుమారు 1850 లక్షలు. జపాన్‌లో 650 లక్షలని అంచనా. పశ్చిమ జర్మనీ. ఫ్రాన్స్, బ్రిటన్, రష్యా, ఇటలీ, స్పెయిన్, కెనడాలలో కూడా టెలిఫోనులు అధికమే

స్వీడన్‌లో ప్రతి 100 మందికి 85 టెలిఫోనులు ఉన్నాయి. అమెరికాలో 100 మందికి సుమారు 79 టెలిఫోనులు ఉన్నాయి.

జపాన్ ముఖ్యపట్టణమైన టోకియోలో 5000 లక్షల జనాభా గల ఆఫ్రికా ఖండంలో కంటే ఎక్కువ టెలిఫోనులు ఉన్నాయి.

"కార్యసిద్ధి అనుకూల ప్రతికూలములు కలిగి ఉండును."

# పోటీలు

(అక్టోబరు 1985)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు, రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: అక్టోబరు 20, 1985. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004. —సంపాదకుడు.

## వ్యాసం

'విద్యార్థులలో విద్యా ప్రమాణాలు పెరగాలంటే' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. బాలి ద్వీపం ఎక్కడ ఉంది?
2. 'ఎడారి ఓడ' అని దేనిని అంటారు?
3. మొట్టమొదటి రెండు అణుబాంబులు

ముందుకు నడిస్తే ఎక్కువ వేగంతో పోగలం




మనం ఒక రైలులో కూర్చొని ప్రయాణం చేస్తూ ఉంటే మనం రైలు వేగంతోటే ఉంటాము. ముందుకు నడుస్తూ ఉంటే రైలు కంటే ఎక్కువ వేగంగా కదులుతాం. మనం రైలు వెనకవైపుకు నడిస్తే రైలు కంటే తక్కువ వేగంతో కదులుతాం.

ఎక్కువ ప్ర

4. కోహినూరు — సూచించిన వాటిలో దేనికి సంబంధించినది: (ఎ) ప్రపంచంలో మిక్కిలి పెద్ద జలపాతం, (బి) సుప్రసిద్ధమైన భారత దేశపు వజ్రం, (సి) పేరుమోసిన అప్పుఋయ్యరు.

5. 'మికీమౌస్' వ్యంగ్య చిత్రాలను సృష్టించినది ఎవరు?

6. భారతదేశపు ఏ రాష్ట్రనాయకుడు వెఱ్ఱివాడిచే ఖైదు చేయబడి, ఆయన కుమార్తెచే విడుదల చేయబడ్డారు?

7. గుఱ్ఱపు పిల్లను ఏమంటారు?

8. అమెరికాలో సినిమా పరిశ్రమకు పేరుపొందిన నగరమేది?

# పజిల్

ఆధారాలు - అడ్డం: 1. జీవేశ్వరుల భేదము ప్రతిపాదించిన శ్రీ శంకరాచార్యులు, 6. వీణ మున్నగు సంగీత సాధనములద్వని, 7. వస్త్రము + అవిరి, 8. ధనమును వడ్డీకి ఇచ్చి జీవనము చేయువానివి, 9. హిందీలో 'వివాహము' అని అర్థమిచ్చే పదం తెలుగులో వాడితే, 11. విష్ణువు అని అర్థమిచ్చే కోతి. 12. బ్రాహ్మము, పాద్మము, వైష్ణవము, బ్రహ్మాండము మొదలైన పదునెనిమిది, 15. సాధారణంగా బ్రేక్‌ఫాస్ట్‌వంటి ఉపాహారానికి తెలుగులో వాడే హిందుస్థానీ పదం 17. కులుకులు గల విటుడు (రెండుమాటలు).

నిలువు: 1. భాషాంతరీకరణము చేయువాడు, 2. బాగా వ్యాపించిన 'మరియాద'



అనే రెండు మాటలలో రెండవ మాటలో అక్షరాలు కలిసిపోయినది, 3. హీనకులజాని రక్ష, 4. మెదపుట వలనను. రాపిడి వలనను పుట్టిన జన మనోహరమగు సువాసన, 5. ఒక రాక్షసునకు శత్రువు అనే మాట తలక్రిందులైంది. 10. షడ్రసములలో ఒకటి-కటువు, 11. చేయి. చేవ్రాత, చేవ్రాలు, 13. రాజులకు రాజు, 14. ఆశ్యాశ కలవాడు, లోభి, 16. శిశువు, పిల్లవాడు.

# తెలివికి పరీక్ష

1. క్రిందివాటికి తెలుగు జాతీయాలు వ్రాయండి: (ఎ) తిరుగులేని తీర్మానము, (బి) కలహమునకై కత్తిగట్టు, (సి) ఏమియు లేకుండా చేయడం.

"శత్రువునైనను ద్రవ్యంబు అడిగిన అర్థివానికి ద్రవ్యంబు ఇచ్చుట హితము."

2. ఈ క్రింది ఖాళీలను సరైన అక్షరముతో పూరించుము: (ఎ) అ౦_దనము=సంతోషించుట, (బి) అ౦_దనము=నమస్కారము, (సి) అ౦_దనము = పాదములంటి మ్రొక్కుట.

3. గడియారము పదమూడు గంటలు కొట్టినప్పుడు టైము ఎంత?

4. ఈ క్రింది వాటిలో ఇముడని పదమేది?

(ఎ) వర్తమానము, (బి) మనుష్యమానము, (సి) దేవమానము, (డి) బ్రహ్మమానము.

5. ఈ క్రిందివాటికి సరైన పదములు వ్రాయండి: (ఎ) ఏనుగుకూత—, (బి) మేఘధ్వని—, (సి) గాడిదకూత—, (డి) గుఱ్ఱంకూత—.

6. దీనిని కొందరు ఆశ్చర్యంగా చూస్తారు, కొందరు ఆశ్చర్యంగా వర్ణిస్తారు, కొందరు ఆశ్చర్యంగా వింటారు, కొందరు చూసి, విని, చెప్పి కూడా తెలుసుకోలేకుండా ఉన్నారు, అవి ఎవరు? ఎవరికి చెప్పారు? అది ఏమిటి?

7. ఒకరు అరణ్యంలోకి ఎంత దూరం వెళ్ళగలరు?

## మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని ఆరాలను గుర్తించండి.

## వినోదమ్
### పోటీల కూపను
### అక్టోబరు 1985

1. అనస్సు: బండి (ఎ), పరమాత్మ (బి), భవిష్యత్తు (సి), పీరు (డి).

2. అనుపు: దయ (ఎ), ఓదార్చుట (బి), పంపుట (సి), సుంకము (డి).

3. ఈవి: కోరిక (ఎ), ఇచ్ఛ (బి), త్యాగము (సి), దానము (డి).

4. ఉపధ: చివరి అక్షరమునకు ముందు అక్షరము (ఎ), కానుక (బి), మార్గము (సి), నది (డి).

5. ఆదీపకుడు: ఇండ్లకు నిప్పుపెట్టే వాడు (ఏ), రసికుడు (బి), దీపములేనివాడు (సి), పురికొల్పువాడు (డి).

6. అలక: ప్రణయకోపము (ఎ), కుబేరుని పట్టణము (బి), ముంగురులు (సి), వృక్ష విశేషము (డి).

## ఆరోగ్యానికి దోసచేసే మేలు

ఆరోగ్యాభివృద్ధికి దోస అనేక రకాలుగా ఉపయోగపడుతుంది. శిరోజాలు బాగా నల్లగా నిగనిగలాడుతూ ఒత్తుగా నిడివిగా పెరగడానికి కారెట్లు, తోటకూర, బచ్చలి రసంతో దోసరసం చేర్చి వాడండి. కీళ్ళవాతానికి దోసకాయ, కారట్లరసం ఉత్తమమైనది పంటి రోగాలకు, చిగుళ్ళ వాపుకు ముఖ్యంగా పయోరియాకు దోసరసం దివ్య ఔషధం.

"పాలిగూళ్ళవంటి పట్టాలలో అనర్థులు, దరిద్రులు, చిక్కుకుంటారు. సమర్థులు, ధనికులు బైటపడతారు."

## ఏప్రిల్ పోటీల కూపను

**అక్టోబరు 1985**

7. ఉరక: విశ్వాపింపక (ఎ), మిన్నక (బి), ప్రయత్నములేక (సి), అశ్వానము (డి).

## ముఖచిత్రవ్యాఖ్య

అరు మాటలకు మించకుండా ఈ పంచిత ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనమ గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే...?

'మన దేవుళ్లందరూ విదేశాలలో బ్రాంచీలు తెరిస్తే' మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ



8 మాటలకు మించకుండా పైన కవి పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

---

"లోకసమ్మతముగా ప్రవర్తించుట, లోకదూష్యమగు కార్యములను చేయకుండుట, ఇతరుల సొమ్మును ఆశింపకుండుట, ఇతరులతో స్నేహభావము కలిగి ఉండుట మంచి మార్గము."

# (ఫలితాలు)

(ఆగస్టు 1985)

వ్యాసం: విజేతలు: మొదటి బహుమతి: కుమారి పి. అపర్ణ, తెనాలి: రెండవ బహుమతి: పి. మోహన్, కోరుకొండ, (విజయనగరంజిల్లా): మూడవబహుమతి: కందుకూరి సోమయ్య, కేసముద్రం (వరంగల్ జిల్లా).

క్విజ్—జవాబులు: 1. 6 సంవత్సరాలు, 2. ఆరుదేశాలు, 3. చీఫ్ జస్టిస్ ఆఫ్ ఇండియా, 4. తమిళం, హిందీ మరియు ఇతర భాషలలో సుప్రసిద్ధ సంగీత గాయకురాలు, 5. రాజ్యతంత్రము, 6. 29 సెంచరీలు, 7. ఫుట్ బాల్, 8. ప్రత్తి.

విజేతలు: మొదటి బహుమతి. ఎమ్. వీరలక్ష్మి, కాకినాడ: రెండవ బహుమతి: వి. నాగార్జునరావు, భూపతి పాలెం, (తూ. గో. జిల్లా): మూడవ బహుమతి: వి. బాలమురళీ కృష్ణ, తెనాలి.

పజిల్ - జవాబులు - అడ్డం: 3. ఆకుమొదలు, 6 వివాహాహ్వానము, 7. ముదముజారు, 8. లోతు సముద్రము, 10. తురుము, 11. ఉక్ల, 12. వినాయకుడు. 14. అప్రమేయము, 16. కులము, 18. వుఎగరుగా లచ్చి.

నిలువు: 1. కవితలోతు, 2. విహాయసము, 3. ఆసముద్రసనామము, 4. కుముదము, 5. దనుజాధీశుడు, 9. తురుష్క ప్రభువు, 12. వియద్గంగ, 13. కులకుల, 15. కాము, 17. లచ్చి.

విజేతలు: మొదటి బహుమతి: వి. జగదీశ్, వరంగల్: రెండవ బహుమతి: వి.వి. లక్ష్మి. గుడ్లవల్లేరు; మూడవ బహుమతి:ఎమ్. ఎస్. సత్యనారాయణమూర్తి, కళింగపట్నం.

# మూకచిత్రవ్యాఖ్య

(ఆగస్టు 1885)

"చూపుల్లో రాగా లెన్నో,
చిరునవ్వుల్లో భావాలెన్నో!"
—ఎస్. వెంకటరమణ పట్నాయక్,
పుట్టూరు, (విజయనగరం జిల్లా)

* * *

"నీ దీర్ఘాలోచన చూస్తుంటే 'విస్డమ్'ని
అన్ని భాషలలోకి ప్రచురించేటట్టుంది."
—యు.ఎమ్. కుమార్, బళ్ళారి, (కర్ణాటక)

* * *

"ఈనాటి నీ మోము
ఏనాటి నీనోమో!"
—చెనమల్లి శ్రీనివాసులు, శ్రీ కాళహ

"భుజబలమాలిని, కార్యము, దైవమును, బంధువులను
తగునట్లుగా పూజింపనివాడు చెడక మానడు."